





# ఉప వేదాలు

## సంగీత కళ

### సంగీత శాస్త్ర వాచకములు - గాన విషయము- 1 ,2





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ నారాయణతీర్థ గ్రంథమాల సం. 3

# సంగీత శాస్త్ర వాచకములు

## గాన విషయము

( లక్ష్య లక్షణములు )

## మొదటి వాచకము

గ్రంథకర్త

పుచ్చా వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి

ప్రథమ ముద్రణము : 1000 ప్రతులు

శాలివాహన శకము ౧౮౭౭

మన్మథ సంవత్సర

క్రీస్తు శకము 1955



మూల్యము రు 1-8-0

# విజ్ఞప్తి

నేటికి ఇరువదియైదు సంవత్సరములకు పూర్వము సంగీతశాస్త్ర పరిశోధన నుపూనుకొని యుంటిని. ఆ పరిశోధనాఫలితముగా నేడధ్యాయముల పరిమితిగల సంగీతమార్తాండమను ఉద్గ్రంథమున రెండు సంపుటములు అచ్చునకు సిద్ధము చేయబడినవి. మరి రెండు సంపుటములు వ్రాయబడుచున్నవి. ఇట్టి విపుల పరిశోధనాకృతికి సామాన్యముగ ప్రచారముండుట కష్టసాధ్యమని గుర్తించి దానికి సోపానక్రమమున సులభ ప్రక్రియలో సంగీతలోకమున కందుబాటులో నుండునట్లును, విశ్వవిద్యాలయముల, ప్రభుత్వముల పాఠ్య ప్రణాళికల ననుసరించియు, 'సంగీతశాస్త్రవాచకముల'ను శీర్షికతో క్రమముగ నైదువాచకములు లక్ష్యలక్షణములతో వ్రాయదలచితిని. అందు ఇయ్యది మొదటివాచకము.

ఇందు ఎనిమిది ప్రకరణములలో లక్షణమును, తొమ్మిది ప్రకరణములలో లక్ష్యమును పూర్తిచేయబడినది. లక్ష్యము తానవర్ణముల వరకు గలదు.

వర్ణములలో ముందు సులభమైనవానినే ప్రారంభింపవలెను. సరళీలను, జంటలను, అలంకారములను మూడుకాలములలోను అభ్యసించుట అవసరము. పిమ్మట వాట్లను స్వరస్థానములలో స్వరాక్షరములకు బదులు అ. ఇ. ఉ. ఎ. ఒ. అను అయిదు అచ్చులతో గూడ సాధకచేసిన మంచి ఉపయోగము కలదు.

సరళీలు, జంటలు మున్నగు వానిని మాయామాళవగౌళ రాగమునందే గాక యింకా అయిదారు రాగములలో కూడ సాధక జేసిన ముందు పాఠము సులభము కాగలదు.

ఈ నా సంగీతశాస్త్ర పరిశోధనకు అయిదు సంవత్సరముల నుండి సహాయము చేయుచున్న హైదరాబాదు ప్రభుత్వము వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

పుస్తకములను అచ్చువేయించుకొనుటకు అవకాశములేని సమయములో ఈ మొదటివాచకమును ముందుగా అచ్చువేసి ఇచ్చుట మూలమున చేసిన మహోపకారమునకు గుంటూరు వెల్కం ప్రెస్సు అధిపతులు శ్రీ జంధ్యాల వేంకటప్పయ్య శాస్త్రి గారికిని, ఇందులకు కారకులైన "భావోద్దీపన గాయక శిఖామణి" శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరి గారికిని ఎంతయు కృతజ్ఞుడను.

ఇట్లు,

పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

# విషయ సూచిక

★


పుట

ప్రార్థన

(1) పరిభాషా పదములు

1. శ్రుతి 1
2. స్వరము 2
3. ఆరోహణము 2
4. అవరోహణము 2
5. స్థాయి 2
6. అపన్యాసము 3
7. పూర్వాంగము 3
8. ఉత్తరాంగము 3
9. ధాతువు 4
10. మాతువు 4
11. శుద్ధము 4
12. వికృతము 4
13. కాలము 4
14. త్రికాలము 5
15. అక్షరకాలము 5
16. గ్రహము 5
17. మేళము 6
18. అలంకారము 6
19. మంద్రము 6
20. మధ్యము 7
21. తారము 7

(2) స్వర విషయము

1. సప్తస్వరముల పేర్లు 9
2. సప్తస్వర సంజ్ఞలు 9
3. స్థాయియందుగల 12 స్వరములు 9
4. 16 శుద్ధవికృతస్వరములు 10
5. వెంకటమఖియొక్క చతుర్దండి ప్రకాశికలో చెప్పబడిన ప్రకారము శుద్ధ వికృతస్వరములకు అక్షర సంజ్ఞలు 15

పుట

(3) రాగము

1. రాగమునకు అర్థము 17
2. మేళ విభాగము 17
3. 72 మేళకర్తలు 25
4. 12 చక్రములు 26
5. మేళములకు కటపయాది సంజ్ఞలు 34
6. సంపూర్ణము 39
7. షాడవము 40
8. ఔడువము 40

(4) తాళము

1. తాళాంగములు 42
2. లఘువుయొక్క జాతులు 43
3. సప్తతాళములు 44
4. సప్తతాళాంగములు 44
5. సప్తతాళ విమర్శన పటకము 46

(5) రాగ లక్షణములు

1. మాయామాళవగౌళ రాగ లక్షణము 47
2. మలహరిరాగ లక్షణము 47
3. తోడిరాగ లక్షణము 50
4. భైరవిరాగ లక్షణము 51
5. దర్బారురాగ లక్షణము 53
6. మోహనరాగ లక్షణము 54
7. కాంభోజిరాగ లక్షణము 55
8. కమాచిరాగ లక్షణము 56
9. ధీరశంకరాభరణరాగ లక్షణము 57
10. అఠాణారాగ లక్షణము 58
11. శుద్ధసావేరిరాగ లక్షణము 59
12. మేచకల్యాణిరాగలక్షణము 61

(6) చతుర్విధ వాద్యములు

1. తత వాద్యములు 63
2. సుషిర వాద్యములు 63
3. అవనద్ధ వాద్యములు 64
4. ఘన వాద్యములు 65
5. తంబుర శ్రుతి 66

| | పుట | | పుట |
|---|---|---|---|
| (7) గీతాదుల లక్షణములు | | | |
| 1. గీతము | 70 | 4. జతి స్వరము | 72 |
| 2. లక్షణ గీతము | 71 | 5. తానము | 73 |
| 3. స్వర జతి | 72 | | |

(8) వాగ్గేయకారుల చరిత్ర

పురందర దాసు 76

(9) లక్ష్యము సూచనలు 77

సరళీ స్వరములు 78

(10) జంటస్వరములు 79

సూచనలు 80

(11) హెచ్చుస్థాయి స్వరములు 81

(12) తగ్గుస్థాయి స్వరములు 82

(13) దాటు స్వరములు 83

(14) అలంకారములు 85

(15) గీతములు

| | | | |
|---|---|---|---|
| 1. శ్రీ గణనాథ | 90 | 6. కమలజవళ | 93 |
| 2. కుందగౌర | 91 | 7. ఆనలేక | 94 |
| 3. కెరయనీరను | 91 | 8. మందరధరే | 95 |
| 4. పదుమనాభా | 92 | 9. గోవిందా | 95 |
| 5. వరవీణా | 92 | | |



# సంగీత శాస్త్ర వాచకములు

## గానవిషయము
## (లక్ష్యలక్షణములు)

★

## మొదటి వాచకము

శ్లో॥ చైతన్యం సర్వభూతానాం వివృత్తం జగదాత్మనా
నాదబ్రహ్మ తదానంద మద్వితీయ ముపాస్మహే॥

## 1. పరిభాషాపదములు

1. శ్రుతి, 2. స్వరము, 3. ఆరోహణము 4. అవరోహణము, 5. స్థాయి, 6. ఆవర్తము, 7. పూర్వాంగము, 8. ఉత్తరాంగము, 9. ధాతువు, 10. మాతువు, 11. శుద్ధము, 12. వికృతము, 13. కాలము, 14. త్రికాలము, 15. అక్షరకాలము, 16. గ్రహము, 17. మేళము, 18. అలంకారము, 19. మంద్రము, 20. మధ్యము, 21. తారము.

వివరములు :—

### (1) శ్రుతి

ఒక మాత్రాకాలములో చెవికి వినిపించునట్టి మొదటి ధ్వనియును, స్వరావయవ లక్షణమును, స్థాయియందు ఇరువది రెండవ భాగమును అగు స్వరమునకు కారణమైన నాదవిశేషము శ్రుతి యని చెప్పబడినది.

## (2) స్వరము

వినువారి చిత్తమును స్వాయముగ రంజింపజేయునట్టిదియు, అనురణనాత్మకమైనదియు, శ్రుతికిమించినదియు, స్థాయి యుండు నిశ్చయస్థానమునందు నాదవిశేషము స్వరమనబడినది. అనగా 22 శ్రుతులతో కూడిన స్థాయియొక్క నాదమును ఏడుగా విభజించగా అందొక్కొక్క భాగము స్వరముగా చెప్పబడినది. నాదవిషయమున శ్రుతి స్వరములకు భేదము ఏమియు లేదు. నాదములకు మధ్యనుండు అంతరముల ననుసరించి శ్రుతి స్వరవ్యవస్థ ఏర్పడినది.

## (3) ఆరోహణము

తగ్గునుండి నాదము హెచ్చునకు నడచుట ఆరోహణము. తగ్గు అనగా నీచము, హెచ్చు అనగా ఉచ్చము.

ఉదాహరణము :— స రి గ మ ప ధ ని సే.

## (4) అవరోహణము

ఉచ్చ (హెచ్చు) నుండి నాదము నీచకు (తగ్గునకు) నడచుట అవరోహణము.

ఉ॥ సే ని ధ ప మ గ రి స

## (5) స్థాయి

ఒకదానికొకటి రెట్టింపు ధర్మములో నుండు రెండు నాదస్థానములతో కూడిన మొత్తము నాదమునకు స్థాయియని పేరు.

ఉ॥ స రి గ మ ప ధ ని సీ

షడ్జము మొదలు పైషడ్జము వరకు గల నాదము (ఈ రెండు షడ్జములతో సహా కలసి) స్థాయి యగుచున్నది.

మంద్రము—మధ్యము—తారము అని స్థాయిలు మూడు గలవు. ఈ స్థాయిలు ఒకదానికంటె ఒకటి క్రమముగా రెట్టింపు రెట్టింపు నాదములు గలవై యున్నవి.

## (6) ఆవర్తము

ఇది తాళమునకు సంబంధించినది. తాళమునకు గల అంగముల నన్నింటిని క్రమముగా ఒక పర్యాయము అనుష్ఠించిన ఆవర్తమనబడును. ఈ ప్రకారముగా తాళాంగములను ఒక పర్యాయము అనుష్ఠించిన పిమ్మట తిరిగి మొదటినుంచి ప్రారంభించిన అది రెండవ ఆవర్తమగును. అనగా తాళమును ఒక పర్యాయము వేయుట ఆవర్తమని తాత్పర్యము.

## (7) పూర్వాంగము

షడ్జము మొదలుగాగల నాలుగు స్వరములు. పూర్వాంగ స్వరములు.

ఉ॥ స రి గ మ

## (8) ఉత్తరాంగము

పంచమము మొదలుగా గల మూడు స్వరములును ఉత్తరాంగ స్వరములు.

ఉ॥ ప ధ ని

పూర్వాంగ ఉత్తరాంగములు స్వరములకే చెప్పబడినవి.

## (9) ధాతువు

స్వరమునకు ధాతు వని పేరు.

## (10) మాతువు

కీర్తన భాగమునకు మాతువని పేరు. కీర్తన యందలి భాషను సాహిత్యమని శాస్త్రజ్ఞులు వ్యవహరించిరి. అందువలన ప్రకరణము ననుసరించి యిచ్చట ధాతు మాతువులన స్వర సాహిత్యములని చెప్పఁబడినవి.

## (11) శుద్ధము

స్పష్టముగా పలుకబడు నియతశ్రుతి నాశ్రయించిన స్వరమునకు శుద్ధమని పేరు. నేఁడు స. ప స్వరములును, మిగతా స్వరములగు రి, గ, మ, ధ, ని స్వరములలో ఒక్కొక్కదానికి ఎన్ని రూపములు చెప్పబడినవో అందు మొదటివన్నీ శుద్ధముగా వ్యవహరింపబడుచున్నవి.

## (12) వికృతము

నియతశ్రుతిని వదలి ఆ స్వరమునకు చెప్పబడిన మిగిలిన శ్రుతులను ఆశ్రయించిన స్వరములు వికృతము లనబడుచున్నవి.

## (13) కాలము

తాళమునకు అవయవ లక్షణమైనది కాలము. క్షణము మొదలు కాక పాదమువరకు కాలములు శాస్త్రమందు వివరింపబడినవి. అతి సూక్ష్మమైన కాలమును వ్యవహరించుటకుగాను క్షణము మొదటిది. అటులనే స్థూలమందు కాక పాదము

చివరది. ఈ రెండును, నీట్లకు మధ్యనుండు కాలములు మాత్రమే వ్యవహారయోగ్యము లగుచున్నవి.

ఈ విషయమై, రెండవ వాచకమున వివరించబడును.

## (14) త్రికాలము

మొదటి కాలము, రెండవ కాలము, మూడవ కాలము అను మూటికిని త్రికాలమని పేరు. తాళమును, పాటను ఒక కాలములోనే ప్రారంభించుట మొదటి కాలము. తాళము నడచు కాలమునకంటెను పాటను రెట్టింపు వేగముగా (తొందరగా) పాడుట రెండ కాలము. ఈ రెండవ కాలమున కంటెను రెట్టింపు తొందరగా అనగా తాళమునడుచు కాలమున కంటెను నాలుగు రెట్లు తొందరగా పాడుట మూడవ కాలము.

## (15) అక్షరకాలము

ఒక హ్రస్వాక్షరమునకు గల కాలము అక్షరకాలము. హ్రస్వాక్షరకాలప్రమాణము అర శెకండు కాలము.

## (16) గ్రహము

తాళగ్రహమని రాగగ్రహమని గ్రహములు రెండు విధములు.

రాగమును ప్రారంభించు స్వరము రాగగ్రహమని, తాళమందు గీతమును ప్రారంభించు స్థానమునకు తాళగ్రహమని పేర్లు.

మిగతా వివరములు సంగీత శాస్త్రాంశమునందు తాళాధ్యాయమున తెలియనగును.

## (17) మేళము

స్వరసంపుటికి మేళమనిపేరు. స్వరములను చేర్చుటకు మేళవించుట యందురు. వాద్యములందు తంత్రులనాదములను సమకూర్చుటకు మేళము చేయుటయందురు. దీనికి యింకా వినియోగములు గలవు గాని యిచ్చట అనవసరమని వదలి వేయబడినవి. రాగవిభాగమున మేళమన మేళకర్తయని తాత్పర్యము.

## (18) అలంకారము

స్థాయి, ఆరోహి, అవరోహి, సంచారి, అను నాలుగు విధములగు స్వరనడకలకు అలంకారములని పేర్లు. ఇది స్వరాలంకార విషయము.

సప్తతాళములను స్వరములచేత అభ్యసించుటకు చెప్పబడిన ధృవ, మఠ్య, రూపకము మున్నగు తాళములును జాతులతోసహా నేడు అలంకారములని వ్యవహరించుచున్నారు. ఇవి తాళాలంకారములు.

## (19) మంద్రము

సంగీతమందు గల మూడు స్థాయిలలోను యిది మొదటి స్థాయికి పేరు. మానవులు వినుటకును, ఉచ్చరించుటకును కూడ యోగ్యమగు అతి సూక్ష్మమైన నాదము మొదలు అట్టి నాదమునకు రెట్టింపునాదము వరకు (ఆరోహణమందు) గల

మొత్తము నాదమునకు మంద్రస్థాయి యనిపేరు.

ఇందు అతిసూక్ష్మ నాదమునకు శరీరమందు స్థానము నాభి. దీనికి రెట్టింపు నాదమునకు శరీరమందు స్థానము హృదయము. ఈ నాదమునకు సూక్ష్మనాదమని పేరు.

## (20) మధ్యము

ఇది మంద్రస్థాయికి ఆరోహణ మందుగల రెండవ స్థాయికిపేరు. హృదయమందుగల సూక్ష్మనాదము మొదలు కంఠస్థానము వరకుగల మొత్తము నాదమునకు మధ్యస్థాయి యనిపేరు. ఇందు కంఠస్థాననాదమునకు పుష్టమని పేరు.

ఈ స్థాయియందు హృదయ స్థానమందలి నాదమునకు కంఠస్థానమందలి నాదము రెట్టింపు ధర్మములో నుండును. మూడుస్థాయిలలోను యిది మధ్యనున్నది.

## (21) తారము

ఇది మధ్యస్థాయికి తరువాత ఆరోహణక్రమమున ఉన్న మూడవ స్థాయికిపేరు. (ఆరోహణమున) కంఠస్థాన మందలి నాదము మొదలు మూర్ధన్యము (యిచ్చట ప్రకరణము నను సరించి (భ్రూమధ్యము) నందలి అపుష్టమైన నాదము వరకుగల మొత్తము నాదమునకు తారస్థాయి యనిపేరు. ఇందు కంఠ స్థాన నాదమునకు మూర్ధన్యనాదము రెట్టింపు ధర్మములో నుండును. ఇచ్చట అపుష్టమున లీనమని తాత్పర్యము.

వీణయందు బిరడాల వైపున తీగలు ఆనియుండు మొదటి మెట్టునకు మేరువయని పేరు. ఈ మేరువస్థానమే శరీర

షడ్జము నాభిస్థానము. వీణయందు పైషడ్జస్థానము శరీరమున హృదయస్థానము. కంఠస్థానములు వీణకును శరీరమునకును సమానములై యుండుచున్నవి. ఈ ప్రకారము ఉపాధ్యాయులు విద్యార్థులచేత స్థాయిలను గుర్తింపజేయవలెను.

మంద్ర, మధ్య, తారస్థాయిలకు ఉదాహరణములు.

స రి గ మ ప ధ ని స
తారము

స రి గ మ ప ద ని స
మధ్యము

స రి గ మ ప ధ ని స
మంద్రము

మంద్ర స్వరములకు క్రింద చుక్కలును తారస్వరములకు పైన చుక్కలును ఉంచబడినవి. చుక్కలులేనివి మధ్యస్థాయి స్వరములు. తారస్థాయి పైషడ్జమునకు (/) ఈ ప్రకారము నిలువుగీటు ఉంచబడినది.



# 2. స్వరవిషయము

## (1) సప్తస్వరముల పేర్లు

షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాధము

## (2) సప్తస్వర సంజ్ఞలు

గానమందు స్వరనాదములను అభ్యసించుటకు గాను పై స్వరనామములయొక్క మొదటి అక్షరములే స్వరసంజ్ఞలుగా చెప్పబడినవి. షడ్జమునకు 'స' అనియును, ఋషభమునకు 'రి' అనియును చెప్పబడినది. ఈ ప్రకారము సప్తస్వరములకు స, రి, గ, మ, ప, ధ, ని. అను అక్షరములు సంజ్ఞలగుచున్నవి.

## (3) స్థాయియందుగల 12 స్వరములు

లోగా వివరింపబడిన మంద్ర, మధ్య, తారము లను మూడు స్థాయిలలో ఒక్కొక్కదానియందు 12 శుద్ధ వికృత స్వరస్థానములు చెప్పబడినవి. స్థాయియందు మొదట షడ్జము మొదలు 12 స్వరస్థానములు పూర్తికాగా 13 వది పైషడ్జమగుచున్నది. 12 స్వరస్థానములకు వరుసగా

(1) షడ్జము (2) శుద్ధ ఋషభము (3) చతుశ్రుతి ఋషభము (4) సాధారణ గాంధారము (5) అంతర గాంధారము (6) శుద్ధ మధ్యమము (7) ప్రతి మధ్యమము (8) పంచమము (9) శుద్ధ ధైవతము (10) చతుశ్రుతి ధైవతము (11) కైశికి నిషాదము (12) కాకలి నిషాదము అని పేర్లు. తిరిగి 13 వది పైషడ్జము.

పేర్ల సంక్షేపము :

| | | |
|---|---|---|
| 1. స | 6. శు.మ | 10. చ.ధ |
| 2. శు.రి | 7. ప్ర.మ | 11. కై.ని |
| 3. చ.రి | 8. ప | 12. కా.ని |
| 4. సా.గ | 9. శు.ధ | 1. స |
| 5. అం.గ | | |

ఈ స్వరములు పై వరుసలో ఒక స్థాయియందు నిరూపించబడుచున్నవి.

12 స్వరస్థానములలో స. ప. అను స్వరములకు మాత్రము ఒక్కొక్క స్థానముకలదు. మిగతా రి. గ మ. ధ. ని. అను అయిదు స్వరములకును రెండేసి స్థానములు గలవు. గాన మొత్తము (5×2=10+2=) 12 స్వర స్థానములైనవి.

## (4) 16 శుద్ధ వికృత స్వరములు

స్థాయియందు స్వరస్థానములు 12 అయినను ఆ 12 స్థానములలోనే 16 స్వరములు వినియోగించు కొనబడుచున్నవి. ఎట్లన స్థాయి ప్రారంభ స్వరము అయిన స గాక దాని తరువాతను వరుసగాగల నాలుగు స్వరస్థానములలో రి. గ స్వరములు రెండును ఒక్కొక్కటి మూడేసి వంతున ఆరు స్వరములు వినియోగ మగుచున్నవి.

### మూడు ఋషభముల పేర్లు

1. శుద్ధ ఋషభము, 2. చతుశ్రుతి ఋషభము, 3. షట్ శ్రుతి ఋషభము. లో గా. శు. రి. చ. రి అను

స్వరములకు మాత్రమే షడ్జస్థానము తరువాతనుగల రెండు స్వర స్థానములు చెప్పబడినవి. మూడవదియైన షట్ శ్రుతి ఋషభమునకు స్థానము తెలియవలసి యున్నది. రెండు ఋషభ స్థానములకు తరువాతను ఆరోహణమందు గల గాంధారము నకు చెప్పబడిన మొదటి స్థానమునందు మూడవ ఋషభమును వినియోగించుకొనిన అది షట్ శ్రుతి ఋషభముగా చెప్పబడి నది. అసలు యిది సాధారణ గాంధారముయొక్క స్థానము. గనుక సాధారణ గాంధారము నకును, షట్ శ్రుతి ఋషభము నకును ఒకటే స్వరస్థానమని తెలియవలెను. ఆ స్వరస్థాన నాదమే ఒకప్పుడు షట్ శ్రుతి ఋషభముగాను, ఇంకొకప్పుడు సాధారణ గాంధారము గాను వినియోగ మగుచున్నది.

## మూడు గాంధారముల పేర్లు

1. శుద్ధ గాంధారము, 2. సాధారణ గాంధారము, 3. అంతర గాంధారము.

లోగా సా, గ, అం, గ. అను రెండు స్వరములకు మాత్రమే స్థానములు చెప్పబడినవి. ఈ రెంటి కంటెను ముందు అనగా అవరోహణమందు యింకొక గాంధారము శుద్ధమని చెప్పబడినది. గాంధారమునకు చెప్పబడిన రెండు స్వరస్థాన ముల కంటెను ముందు (అవరోహణమందు) గల మొదటి స్వర స్థానము ఋషభమునకు చెప్పబడిన రెండవ స్వరస్థానమై యున్నది. ఇది చతుశ్రుతి ఋషభస్థానము. ఈ స్థానమునందు మూడవ గాంధారమును వినియోగించుకొనిన అది శుద్ధ గాంధారమని చెప్పబడినది. అనగా చతు శ్రుతి ఋషభము

నకునకు, శుద్ధ గాంధారమునకును ఒకటే స్థానమని తాత్పర్యము. ఈ స్వరస్థానమే ఒకప్పుడు చతుశ్రుతి ఋషభముగాను, మరొకప్పుడు శుద్ధ గాంధారము గాను వినియోగ మగుచున్నది. పై ప్రకారము షడ్జస్థానమునకు తరువాతనుగల నాలుగు స్వర స్థానములలోను మూడు ఋషభములును, మూడు గాంధార ములును మొత్తము ఆరుస్వరములును ఉదహరింపబడుచున్నవి.

ఉదాహరణము :

ఆరోహణ గతి

| | | | |
|---|---|---|---|
| | స | మేరువు | |
| 1. | శు.రి | | |
| 2. | చ.రి | శు.గ | 1 |
| 3. | ష.రి | సా.గ | 2 |
| | | అం.గ | 3 |

## మూడు ధైవతములు, మూడు నిషాదములు

ఈప్రకారముగానే పంచమముయొక్క స్వరస్థానమునకు తరువాతను (ఆరోహణమందు) గల 4 స్వర స్థానములలో మొదటిస్థానమునుండి వరుసగా మూడు ధైవతములును, రెండవ స్వరస్థానమునుండి వరుసగా మూడు నిషాదములును చెప్ప బడినవి. మూడు ధైవతములలో రెంటిపేర్లు ఇదివరకే చెప్ప బడినవి. ఈ రెంటికిని తరువాతను ఆరోహణమందు మూడవ ధైవతము షట్శ్రుతి ధైవతమనియును, రెండు నిషాదములకు

ముందు అవరోహణమందు మొదట (మూడవనిషాదము) శుద్ధ నిషాద మనియును చెప్పబడినవి.

గనుక రెండవదియైన చతుశ్రుతి ధైవతమును మొదటిది అయిన శుద్ధనిషాదమును ఒక స్థానమునందే వినియోగమగు చున్నవి. అటులనే మూడవదియైన షట్‌శ్రుతి ధైవతమును, రెండవదియైన కైశికి నిషాదమును ఒక స్థానమునందే వినియోగ మగుచున్నవి. మూడు ధైవతములు, మూడు నిషాదములు, కలసి మొత్తము ఆరుస్వరములును పంచమము తరువాతను గల నాలుగు స్వరస్థానములలోను వరుసగా చెప్పబడినవి. ఈ ఆరు స్వరములు దిగువను ఉదహరింపబడుచున్నవి.

ఉదాహరణము :

| | | |
|---|---|---|
| | — | ప |
| శు.ధ | — | |
| చ.ధ | — | శు.ని |
| ష.ధ | — | కై.ని |
| | — | కా.ని |

ఈ విధముగ ఋషభగాంధారములు 6 స్వరములును, ధైవత నిషాదములు 6 స్వరములును కలసి మొత్తము 12 స్వరములు అయినవి. స్థాయియందుగల 7 స్వరములలో యింతవరకు చెప్పబడిన రి. గ. ధ. ని లు పోగా యిక స, మ, ప, లు మిగిలినవి. స.ప లకు మార్పు ఉండదు. అందువలన వాటికి ఒక్కొక్కటి వంతున అవి రెండు స్వరములును, శుద్ధ

మధ్యమము ప్రతి మధ్యమము అనునది రెండు స్వరములును కలిసి మొత్తము నాలుగు స్వరములైనవి. ఈ నాలుగు సర్వములు పై 12 స్వరములను కలిపి మొత్తము స్థాయియందు (12+4=) 16 స్వరములైనవి. ఇవి దిగువ నుదహరింపబడుచున్నవి.

ఉదాహరణము :

## 16 స్వరములు

| | | | |
|---|---|---|---|
| 1. | స | | |
| 2. | శు.రి | | |
| 3. | చ.రి | శు.గ | 5 |
| 4. | ష.రి | సా గ | 6 |
| | | అం.గ | 7 |
| | | శు.మ | 8 |
| | | ప్ర.మ | 9 |
| 10. | ప | | |
| 11. | శు.ధ | | |
| 12. | చ.ధ | శు.ని | 14 |
| 13. | ష.ధ | కై.ని | 15 |
| | | కా.ని | 16 |
| | స | | |

ఈ 16 స్వరములలో స.రి.గ.మ.ప.ధ.ని అను సప్త స్వరములకు చెప్పబడిన మొదటి స్వరములు (7) శుద్ధములుగాను, తక్కినవి (9) వికృతములుగాను చెప్పబడినవి. వీని వివరములు :

| 7 శుద్ధ స్వరములు | | 9 వికృతి స్వరములు | |
|---|---|---|---|
| 1 | స | చ.రి | 1 |
| 2 | శు.రి | ష.రి | 2 |
| 3 | శు.గ | సా.గ | 3 |
| 4 | శు.మ | అం.గ | 4 |
| 5 | ప | ప్ర.మ | 5 |
| 6 | శు.ధ | చ.ధ | 6 |
| 7 | శు.ని. | ష.ధ | 7 |
| | | కై.ని | 8 |
| | | కా.ని. | 9 |

## (5) వెంకట మఖియొక్క చతుర్దండి ప్రకాశికలో చెప్పబడిన ప్రకారము శుద్ధ వికృత స్వరములకు అక్షర సంజ్ఞలు.

స. ప. స్వరములు ఎప్పుడును శుద్ధములే యగుటచే వానికి అక్షర సంజ్ఞలు చెప్పబడలేదు. మిగిలినవానికి చెప్పబడుచున్నవి.

| శుద్ధ వికృత స్వరములు | అక్షర సంజ్ఞలు |
|---|---|
| శు–రి | ర |
| చ.రి | రి |
| ష.రి | రు |
| శు.గ | గ |
| సా.గ | గి |

| శుద్ధ వికృత స్వరములు | అక్షర సంజ్ఞలు |
|---|---|
| అం.గ | గు |
| శు.మ | మ |
| ప్ర.మ | మి |
| శు.ధ | ధ |
| చ.ధ | ధి |
| ష.ధ | ధు |
| శు.ని | న |
| కై.ని | ని |
| కా.ని | ను |



# 3. రాగము

## (1) రాగమునకు అర్థము

వినువారి చిత్తమును రంజింప జేయునట్టి స్వర, వర్ణము లతో కూడిన ధ్వనివిశేషమునకు రాగమనిపేరు.

## (2) మేళవిభాగము

ఇచ్చట మేళమన మేళకర్త యని అర్థము. రాగ విభాగమునందు మొదటివిగా యేర్పడిన రాగములు మేళకర్త లన బడినవి. నేడు మేళకర్తలన్నియు సంపూర్ణములు.

శుద్ధ వికృత స్వరములనుండి 72 మేళములు ఏర్పడినవి. మేళములు ఏర్పడిన విధానమును తెలియుటకుగాను షడ్జము మొదలు వరుసగానున్న అయిదు స్వరస్థానములలోను, షడ్జము, మూడురిషభములు, మూడు గాంధారములు కలసి స రి గ అని పునరుక్తి లేకుండా యెన్ని పర్యాయములు ఉచ్చరించుటకు వీలగునో ముందు తెలియవలెను. పునరుక్తి అనగా వచ్చిన విధము మళ్ళీవచ్చుట.

ఈసందర్భములో షడ్జమును, మొదటి (శు. రి) రిషభమును, మొదటి (శు. గ) గాంధారమును, చేర్చి స రి గ. అనిన అదియొక విధమగును. షడ్జమును, మొదటి (శు. రి) రిషభమును, రెండవ (సా. గ) గాంధారమును చేర్చి 'స రి గ' అనిన రెండవ విధము. షడ్జమును, మొదటి (శు. రి) రిషభమును,

అంతర (అం. గ) గాంధారమును చేర్చి 'స రి గ' అనిన మూడవ భేదము.

ఇంతవరకు మొదటి (శు. రి) రిషభముతో మూడు గాంధారములు వాడబడినవి. రెండవ (చ. రి) రిషభమునకును మొదటి (శు. గ) గాంధారమునకును ఒకటే స్థానమైనందున రెండవ (చ. రి) రిషభముతో మొదటి (శు. గ) గాంధారము వాడబడదు. రెండు (సా. గ, అం. గ) గాంధారములే వినియోగమగును.

షడ్జమును, రెండవ (చ. రి) రిషభమును, రెండవ (సా. గ) గాంధారమునుచేర్చి 'స రి గ' అనిన నాలుగవ భేదము. షడ్జమును, రెండవ (చ. రి) రిషభమును, మూడవ (అం. గ) గాంధారమునుచేర్చి 'స రి గ' అనిన అయిదవభేదము.

ఇంతవరకు రెండవ (చ. రి) రిషభముతో రెండు (సా. గ., అం. గ.) గాంధారములు వాడబడినవి. ఇక మూడవ (ష. రి) రిషభమున్నది. మూడవ రిషభమునకును రెండవ (సా. గ) గాంధారమునకును స్థానము ఒకటే అయినందున మూడవ (ష. రి) రిషభముతో రెండవ (సా. గ) గాంధారము వాడబడదు. గాని మూడవ (అం. గ) గాంధారము ఒకటే వాడబడును.

షడ్జమును, మూడవ (ష. రి) రిషభమును, మూడవ (అం. గ) గాంధారమునుచేర్చి 'స రి గ' అనిన ఆరవభేదము.

ఇంతవరకు షడ్జము, మూడురిషభములు, మూడు గాంధారములు కలసి మొత్తము 7 స్వరములు పూర్తియైనవి. ఇందులకు స్వరస్థానములు 5 వినియోగమైనవి.

ఉదాహరణము :

స | శు. రి | చ. రి=శు. గ | సా. గ=ష. రి | అం. గ

| | | | | | |
|---|---|---|---|---|---|
| భేదము 1. | స | శు. రి | శు. గ | | |
| ,, 2. | స | శు. రి | | సా. గ | |
| 3. | స | శు. రి | | | అం. గ |
| 4. | స | | చ. రి | సా. గ | |
| 5. | స | | చ. రి | | అం. గ |
| 6. | స | | | ష. రి | అం. గ |

ఈ పై విభాగములు స. రి. గ. మూడు స్వరములతో ఉదహరింపబడుచున్నవి.

| | స. | రి. | గ. |
|---|---|---|---|
| మొదటి భేదము | స. | శు. | శు. |
| 2. | స. | శు. | సా. |
| 3. | స. | శు. | అం. |
| 4. | స. | చ. | సా. |
| 5. | స. | చ. | అం. |
| 6. | స. | ష. | అం. |

ఇదేవిధమున పంచమస్థానము మొదలు వరుసగానున్న అయిదు స్వరస్థానములలోను పంచమము, మూడుధైవతములు,

మూడు నిషాదములు కలసి 'ప ధ ని' అని యెన్ని పర్యాయములు ప్రసక్తి లేకుండా అనుటకు వీలగునో తెలియవలెను.

సరిగమ ప్రస్తారములందు వలెనే యిక్కడగూడ పంచమమును, మొదటి (శు. ధ) ధైవతమును, మొదటి (శు. ని) నిషాదమును చేర్చి 'ప ధ ని' అనిన అది మొదటి విధమగును. పంచమమును, మొదటి (శు. ధ) ధైవతమును, రెండవ (కై. ని) నిషాదమును చేర్చి 'ప ధ ని' అనిన అది రెండవ విధమగును. పంచమమును, మొదటి (శు. ధ) ధైవతమును, మూడవ (కా. ని) నిషాదమునుచేర్చి ప. ధ. ని. అనిన మూడవ భేదమగును.

ఇంతవరకు మొదటి (శు. ధ) ధైవతముతో మూడు నిషాదములును వాడబడినవి. రెండవ (చ. ధ) ధైవతమునకును, మొదటి (శు. ని) నిషాదమునకును ఒకటే స్థానమైనందున రెండవ (చ. ధ) ధైవతముతో మొదటి (శు. ని) నిషాదము వాడబడదు. రెండు (కై. ని; కా. ని.) నిషాదములే వినియోగమగును.

పంచమమును, రెండవ (చ. ధ.) ధైవతమును, రెండవ (కై. ని.) నిషాదమునుచేర్చి "పధని" అనిన అది నాలుగవ భేదమగును. పంచమమును, రెండవ (చ. ధ.) ధైవతమును, మూడవ (కా. ని) నిషాదమునుచేర్చి "పధని" అనిన అయిదవ భేదమగును.

ఇంతవరకు రెండవ (చ. ధ) ధైవతముతో రెండు (కై. ని, కా. ని) నిషాదములు వాడబడినవి. ఇక మూడవ

(ష. ధ) ధైవతమున్నది.

మూడవ (ష. ధ) ధైవతమునకును, రెండవ (కై. ని) నిషాదమునకును స్థానము ఒకటే అయినందున మూడవ (ష. ని) ధైవతముతో రెండవ (కై. ని) నిషాదము వాడబడదు. గాన మూడవ (కా. ని) నిషాదము ఒకటే వినియోగమగును.

షడ్జమును, మూడవ (ష. ధ) ధైవతమును, మూడవ (కా. ని) నిషాదమును చేర్చి "పధని" అనుట ఆరవ భేదము.

ఇచ్చటివరను పంచమము, మూడు ధైవతములు, మూడు నిషాదములుకలసి మొత్తము 7 స్వరములు చెప్పబడినవి. ఇవి దిగువను ఉదహరింపబడుచున్నవి.

**ఉదాహరణము :**

| | ప | శు. ధ | చ. ధ=శు. ని | కై. ని=ష. ధ | కా. ని |
|---|---|---|---|---|---|
| భేదము 1. | ప | శు. ధ | శు. ని | | |
| 2. | ప | శు. ధ | | కై. ని | |
| 3. | ప | శు, ధ | | | కా. ని |
| 4. | ప | | చ. ధ | కై. ని | |
| 5. | ప | | చ. ధ | | కా. ని |
| 6. | ప | | | ష, ధ | కా. ని |

ఈ విభాగములు ప. ధ. ని అను మూడు స్వరములతో ఉపహరింపబడుచున్నవి.

| | ప. | ధ. | ని. |
|---|---|---|---|
| మొదటి భేదము | ప. | శు. | శు. |
| 2. | ప. | శు. | కై |
| 3. | ప. | శు. | కా |
| 4. | ప. | చ. | కై |
| 5. | ప. | చ. | కా |
| 6. | ప | ష. | కా |

ఇంతవరకు వివరించబడిన సరిగ, పధని భేదములలో (7 + 7) 14 శుద్ధ వికృతస్వరములును, (5 + 5) 10 స్వరస్థానములలో వినియోగమైనవి. ఇవి ఒక పథకమునందే నిరూపింపబడుచున్నవి.

| | స | రి | గ | మ | ప | ధ | ని | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | స. | శు. | శు. | | ప. | శు. | శు. | 1. |
| 2. | స. | శు. | సా. | | ప. | శు. | కై. | 2. |
| 3. | స. | శు. | అం. | | ప. | శు. | కా. | 3. |
| 4. | స, | చ. | సా. | | ప. | చ. | కై. | 4. |
| 5. | స. | చ. | అం. | | ప. | చ. | కా. | 5. |
| 6. | స. | ష. | అం. | | ప. | ష. | కా. | 6. |

పై స్వరములలో కొన్నిటికి ఒక్కొక్క దానికి రెండు, మూడు శ్రుతులు చెప్పబడినవి. రాగమున ప్రతిస్వరము ఏదో ఒక శ్రుతియందే వినియోగమగును. గనుక ఆవిధముగ

పై భేదములలో స రి గ మ ప ధ ని అని పునరుక్తులు లేకుండా ఎన్ని పర్యాయములు అనుటకు వీలగునో తెలియవలసియున్నది.

షడ్జమును, రి. గ ప్రస్తారములోని మొదటి (శు. రి. శు. గ) భేదమును, శుద్ధమధ్యమమును, పంచమమును, ధ. ని. ప్రస్తారములోని మొదటి (శు. ద. శు. ని) భేదమును చేర్చిన అదియొక భేదమగును. ఇదియొక మేళకర్తయనబడినది. ఈ విధముగనే రి గ ప్రస్తారములో మొదటి భేదముతో ధ. ని ప్రస్తారములోని మిగతా భేదములను ఒక్కొక్కదానిని వినియోగించిన 6 భేదములగును. అప్పుడు రి. గ లలోని మొదటి భేదముతో ధ. ని భేదములు 6 ను పూర్తియగును. ఇదే విధమున రి. గ భేదములలో ఒక్కొక్కదానితో ధ. ని భేదములను ఆరింటిని వాడిన మొత్తము 6×6=36 భేదములగుచున్నవి. ఈ 36 భేదములును దిగువ పధకమున వివరింపబడుచున్నవి.

| | స | రి | గ | మ | ప | ధ | ని |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | శు | శు | | శు | శు | శు |
| 2 | | శు | శు | | శు | శు | కై |
| 3 | | శు | శు | | శు | శు | కా |
| 4 | | శు | శు | | శు | చ | కై |
| 5 | | శు | శు | | శు | చ | కా |
| 6 | | శు | శు | | శు | ష | కా |
| 7 | | శు | సా | | శు | శు | శు |
| 8 | | శు | సా | | శు | శు | కై |
| 9 | | శు | సా | | శు | శు | కా |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 10 | శు | సా | శు | చ | కై |
| 11 | శు | సా | శు | చ | కా |
| 12 | శు | సా | శు | ష | కా |
| 13 | శు | అం | శు | శు | శు |
| 14 | శు | అం | శు | శు | కై |
| 15 | శు | అం | శు | శు | కా |
| 16 | శు | అం | శు | చ | కై |
| 17 | శు | అం | శు | చ | కా |
| 18 | శు | అం | శు | ష | కా |
| 19 | చ | సా | శు | శు | శు |
| 20 | చ | సా | శు | శు | కై |
| 21 | చ | సా | శు | శు | కా |
| 22 | చ | సా | శు | చ | కై |
| 23 | చ | సా | శు | చ | కా |
| 24 | చ | సా | శు | ష | కా |
| 25 | చ | అం | శు | శు | శు |
| 26 | చ | అం | శు | శు | కై |
| 27 | చ | అం | శు | శు | కా |
| 28 | చ | అం | శు | చ | కై |
| 29 | చ | అం | శు | చ | కా |
| 30 | చ | అం | శు | ష | కా |
| 31 | ష | అం | శు | శు | శు |
| 32 | ష | అం | శు | శు | కై |
| 33 | ష | అం | శు | శు | కా |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 34 | ష | అం | శు | చ | కై |
| 35 | ష | అం | శు | చ | కా |
| 36 | ష | అం | శు | ష | కా |

పై పథకమున ఆరేసి భేదముల కొక పర్యాయము రి.గ. లతో కూడిన మార్పుకలిగినది. ధ ని ల భేదములు ఆరును ప్రాప్తి యైనపిమ్మట రి. గ ల భేదము మారినది. అప్పుడు ధ. ని భేదములు మళ్ళీ మొదటినుండి వచ్చినవి. ఇట్లులనే రి. గ. ల భేదముల ఆరింటికిని (6 × 6) 36 భేదములు ఏర్పడినవి. ఈ భేదములకు మేళకర్తలని పేరు. ఇవి స రి గ మ ప ధ ని అను సప్తస్వరములతో కూడియున్నవి. ఈ 36 మేళకర్తలకును మధ్యమము శుద్ధముగా చెప్పబడినది. ఇంతవరకు 15 శుద్ధ వికృత స్వరములు 11 స్వరస్థానములును వచ్చినవి.

## (3) 72 మేళకర్తలు

పై 36 మేళకర్తలలోను మధ్యమము శుద్ధమధ్యమము గాక ప్రతిమధ్యమమును వాడిన తిరిగి 36 మేళకర్తలు ఏర్పడు చున్నవి. అనగా శుద్ధమధ్యమముతో కూడినవి 36 ను, ప్రతి మధ్యమముతో కూడినవి 36 ను మొత్తము (36 + 36) 72 మేళకర్తలైనవి. ప్రతి మధ్యమము గల మేళకర్తలలో మధ్యమము ఒకటె తేడాగాని మిగిలిన స్వరములన్నియు శుద్ధమధ్యమ మేళకర్తల మాదిరేను.

ప్రతి మేళకర్తయును పై షడ్జముతోడ కలిసినప్పుడే స్థాయి పూర్తియగును. అప్పుడే రాగముగ అనుభవించుటకు అను

కొలత సరిపోదు. పైషడ్జముతో కూడ కలసి స్వరములు ప్రతి మేళకర్త రాగమునందును స రి గ మ ప ధ ని స అనియుండును.

స్వరములు ఏడేగదా పైషడ్జమును ఎందులకు కలుపవలెనను సంశయము కొందరికి కలుగవచ్చును. నాలుగు గజముల ప్రదేశమును కొలుచునపుడు మొదటి గజమునకు సమాప్తిస్థానమును రెండవ గజమునకు ప్రారంభస్థానమును ఒకటేయగుచున్నది. రెండవ గజముయొక్క ప్రారంభస్థానమును చేరనిది మొదటి గజమునకు కొలత పూర్తి కాజాలదు. అటులనే షడ్జముతో ప్రారంభమైన స్థాయి తిరిగి రెండవ స్థాయికి ప్రారంభ స్థానమైన పైషడ్జమును చేరనిది పూర్తి కానేరదు. నిషాదమువరకే ఆగిన నిషాదమునకును పై షడ్జమునకును మధ్యనుగల నాదము స్థాయికి లోపించును. అసంపూర్తిస్థాయి గానమునకు అనుకూలము కాజాలదు.

## (4) 12 చక్రములు

72 మేళకర్త రాగములలోను ఆరేసి రాగములకు ఒక్కొక్క చక్రమను పేరు చెప్పబడెను. ఈ ప్రకారము 72 మేళకర్తలకును (72 ÷ 6 =) 12 చక్రములు చెప్పబడినవి. ఈ చక్రములలో 6 చక్రములు శుద్ధమధ్యమ మేళకర్తలకును 6 ప్రతిమధ్యమ రాగములకును చెప్పబడినవి.

రి గ ల భేదములకు ఆరింటికిని చక్రములనియును, ధ. ని భేదములకు ఆరింటికిని రాగములనియును పేర్లు. రి, గ, ల భేద

ములు మొదటి 6 చక్రముల లోనివే. మిగతా 6 చక్రములలో కూడ వచ్చును. గనుక వేంకటమఖి చెప్పిన అక్షరసంజ్ఞలు 6 భేదములు చక్రములకు చెప్పబడుచున్నవి.

1—7 చక్రములందు ర. గ., 2—8 చక్రములందు ర. గి., 3—9 చక్రములందు ర. గు., 4—10 చక్రములందు రి. గి., 5—11 చక్రములందు రి. గు., 6—12 చక్రములందు రు. గు.,

ధ ని భేదములు 6 ను మొదటి చక్రమునందు వలెనే మిగతా చక్రములందు అగుచున్నవి. ధ ని లకు మొదటి చక్రమందలి 6 భేదములకు అక్షరసంజ్ఞలు.

(1) ధ న (2) ధ ని (3) ధ ను (4) ధి ని (5) ధి ను (6) ధు ను

72 మేళకర్తలకును పేర్లును, స్వరములకు చక్రనామము లును దిగువపథకములందు వివరింపబడుచున్నవి. వీనిలో శుద్ధ మధ్యమముగల 36 మేళములకు పూర్వమేళములనియును, ప్రతిమధ్యమముగల 36 మేళములకు ఉత్తర మేళములనియును వ్యవహారము.

దిగువ పథకములందు ఎడమవైపున పూర్వమేళముల నామములును కుడివైపున ఉత్తరమేళముల నామములును గలవు. మేళమునకుగల స్వరములలో మధ్యమమును శుద్ధ ముగా వినియోగించుకొనిన పూర్వమేళమనియును లేక ప్రతి మధ్యమమును వినియోగించుకొనిన ఉత్తమ మేళమనియును గ్రహింపవలెను. అయితే పథకములందు మాత్రము మధ్య మము శుద్ధముగానే ఉదహరించబడుచున్నది.

# 72 మేళకర్త రాగముల నిరూపణ పథకము

(1) ఇందుచక్రము. (7) ఋషిచక్రము.

ర. గ

| సం. | శుద్ధమధ్యమ మేళకర్తల పేర్లు | ఆరోహస్వరములు, వాని శ్రుతులు | | | | | | | | ప్రతిమధ్యమ మేళకర్తల పేర్లు | సం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | స | రి | గ | మ | ప | ధ | ని | స | | |
| 1 | కనకాంగి | ,, | శు | శు | శు | ,, | శు | శు | ,, | సాలగము | 37 |
| 2 | రత్నాంగి | ,, | ,, | ,, | ,, | ,, | శు | కై | ,, | జలార్ణవము | 38 |
| 3 | గానమూర్తి | ,, | ,, | ,, | ,, | ,, | శు | కా | ,, | ఝాలవరాళి | 39 |
| 4 | వనస్పతి | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై | ,, | నవనీతము | 40 |
| 5 | మానవతి | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా | ,, | పావని | 41 |
| 6 | తానరూపి | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా | ,, | రఘుప్రియ | 42 |

(2) నేత్రచక్రము.

(8) వసుచక్రము.

ర. గి

| సం. | శుద్ధమధ్యమ మేళకర్తల పేర్లు | ఆరోహణ స్వరములు, వాని శ్రుతులు. | | | | | | | | ప్రతిమధ్యమ మేళకర్తల పేర్లు | సం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | స | రి | గ | మ | ప | ధ | ని | స | | |
| 7 | సేనాపతి | ,, | శు | సా | శు | ,, | శు | శు | ,, | గవాంభోధి | 43 |
| 8 | హనుమత్తోడి | ,, | ,, | ,, | ,, | ,, | శు | కై | ,, | భవప్రియ | 44 |
| 9 | ధేనుక | ,, | ,, | ,, | ,, | ,, | శు | కా | ,, | శుభపంతువరాళి | 45 |
| 10 | నాటకప్రియ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై | ,, | షడ్విధమార్గిణి | 46 |
| 11 | కోకిలప్రియ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా | ,, | సువర్ణాంగి | 47 |
| 12 | రూపవతి | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా | ,, | దివ్యమణి | 48 |

(3) అగ్నిచక్రము. (9) బ్రహ్మచక్రము.

ర. గు

| సం. | శుద్ధమధ్యమ మేళకర్తల పేర్లు | ఆరోహణస్వరములు, వాని శ్రుతులు | | | | | | | | ప్రతిమధ్యమ మేళకర్తల పేర్లు | సం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | స | రి | గ | మ | ప | ధ | ని | స | | |
| 13 | గాయకప్రియ | ,, | శు | అం | శు | ,, | శు | శు | ,, | ధవళాంబరి | 49 |
| 14 | వకుళాభరణము | ,, | ,, | ,, | ,, | ,, | శు | కై | ,, | నామనారాయణి | 50 |
| 15 | మా.మాళ. గౌళ | ,, | ,, | ,, | ,, | ,, | శు | కా | ,, | కామవర్ధని | 51 |
| 16 | చక్రవాకము | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై | ,, | రామప్రియ | 52 |
| 17 | సూర్యకాంతము | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా | ,, | గమనశ్రమ | 53 |
| 18 | హాటకాంబరి | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా | ,, | విశ్వంభరి | 54 |

(4) వేదచక్రము. (10) దిశచక్రము.

రి. గి

| సం. | శుద్ధమధ్యమ మేళకర్తల పేర్లు | ఆరోహణస్వరములు, వాని శ్రుతులు | | | | | | | | ప్రతిమధ్యమ మేళకర్తల పేర్లు | సం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | స | రి | గ | మ | ప | ధ | ని | స | | |
| 19 | ఝుంకారధ్వని | ,, | చ | సా | శు | ,, | శు | శు | ,, | శ్యామలాంగి | 55 |
| 20 | నఠభైరవి | ,, | ,, | ,, | ,, | ,, | శు | కై | ,, | షణ్ముఖప్రియ | 56 |
| 21 | కీరవాణి | ,, | ,, | ,, | ,, | ,, | శు | కా | ,, | సిం. మధ్యమము | 57 |
| 22 | ఖరహరప్రియ | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై | ,, | హేమవతి | 58 |
| 23 | గౌరీమనోహరి | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా | ,, | ధర్మవతి | 59 |
| 24 | వరుణప్రియ | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా | ,, | నీతిమతి | 60 |

(5) బాణచక్రము. (11) రుద్రచక్రము.

రి. గు

| సం. | శుద్ధమధ్యమ మేళకర్తల పేర్లు | ఆరోహణస్వరములు, వాని శ్రుతులు | | | | | | | | ప్రతిమధ్యమ మేళకర్తల పేర్లు | సం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | స | రి | గ | మ | ప | ధ | ని | స | | |
| 25 | మారరంజని | ,, | చ | అం | శు | ,, | శు | శు | ,, | కాంతామణి | 61 |
| 26 | చారుకేశి | ,, | ,, | ,, | ,, | ,, | శు | కై | ,, | రిషభప్రియ | 62 |
| 27 | సరసాంగి | ,, | ,, | ,, | ,, | ,, | శు | కా | ,, | లతాంగి | 63 |
| 28 | హరికాంభోజి | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై | ,, | వాచస్పతి | 64 |
| 29 | ధీరశం. భరణము | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా | ,, | మేచకళ్యాణి | 65 |
| 30 | నాగానందిని | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా | ,, | చిత్రాంబరి | 66 |

(6) ఋతుచక్రము. (12) ఆదిత్యచక్రము.

రు. గు

| సం. | శుద్ధమధ్యమ మేళకర్తల పేర్లు | ఆరోహణస్వరములు, వాని శ్రుతులు | | | | | | | | ప్రతిమధ్యమ మేళకర్తల పేర్లు | సం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | స | రి | గ | మ | ప | ధ | ని | స | . | |
| 31 | యాగప్రియ | ,, | షు | అం | శు | ,, | శు | శు | ,, | సుచరిత్ర | 67 |
| 32 | రాగవర్ధని | ,, | ,, | ,, | ,, | ,, | శు | కై | ,, | జ్యోతిస్వరూపిణి | 68 |
| 33 | గాం. భూషణి | ,, | ,, | ,, | ,, | ,, | శు | కా | ,, | ధాతువర్ధని | 69 |
| 34 | వాగధీశ్వరి | ,, | ,, | ,, | ,, | ,, | చ | కై | ,, | నాసికాభూషణి | 70 |
| 35 | శూలిని | ,, | ,, | ,, | ,, | ,, | చ | కా | ,, | కోసలము | 71 |
| 36 | చలనాట | ,, | ,, | ,, | ,, | ,, | ష | కా | ,, | రసికప్రియ | 72 |

## (౫) "మేళములకు కటపయాది సంజ్ఞలు"

72 మేళములకు పేర్లు క. ట. ప. య. అను నాలుగు వర్గల యందుగల అక్షర క్రమము ననుసరించి నిర్ణయింప బడినవి.

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క వర్గునకు:— | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | అను |

తొమ్మిది అక్షరములును

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ట వర్గునకు:— | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | అను |

తొమ్మిది అక్షరములును

| | 1 | 2 | 3 | 4 | 5 | |
|---|---|---|---|---|---|---|
| ప వర్గునకు:— | ప | ఫ | బ | భ | మ | అను అయిదు అక్ష |

రములును

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| య వర్గునకు | య | ర | ల | వ | శ | ష | స | హ | అను ఎని |

మిది అక్షరములును ప్రసిద్ధములు.

శాస్త్రమందు "కాదిర్నవోటాదినవ పాదిపంచ యాద్యష్టకం." అని పై విధముగా చెప్పబడినవి. ఙ, ఞ, న. అను అక్షరములు ఎచ్చటవచ్చినను సున్నగా (౦) గ్రహించ వలెను.

# మేళముయొక్క పేరునుబట్టి ఆ మేళముయొక్క సంఖ్యను తెలియుటకు విధానము.

మేళము పేరునందు మొదటనుగల రెండు అక్షరములు పై నాలుగు వర్గులలోను ఏ వర్గులో ఏ సంఖ్యలో నున్నవో చూచుకొని క్రమముగానున్న ఆ రెండు సంఖ్యలలోను రెండవ దానిని మొదటిదానినిగాను, మొదటిదానిని రెండవదానినిగాను వరుసగా ఉంచిన అది ఆ మేళముయొక్క సంఖ్యయగును. మేళకర్త పేరునందుగల మొదటి రెండు అక్షరములలోను "న" అను అక్షరమున్నచో దానిని సున్న (౦) గా గ్రహించవలెను.

ఉదాహరణము

కామవర్ధని అను మేళముయొక్క సంఖ్యను తెలియుటకుముందు ఈ మేళమునందు మొదటనుగల కా. మ. అను రెండు అక్షరములకు అంకెలను తెలియవలెను. క. అనునది కవర్గమున 1 వది. మ. అనునది మూడవ వర్గునందు 5 వది. అప్పుడు వరుసగా 15 అంకెలువచ్చును. ఈ రెంటిని అటుది యిటు, యిటుది అటు మార్చిన 51 అగును. కామవర్ధని మేళము సంఖ్య 51 అని తేలినది. అటులనే 'హనుమత్తోడి' మేళమందు మొదటనుగల "హ" నాలుగవ వర్గులో 8 వది. ను అను దానికి ౦. అని చెప్పబడినది. వరుసగా 80 అని వచ్చిన వానిని అటుది యిటు యిటుది అటు మార్చిన 08 వచ్చును. ఇచ్చట సున్నకు విలువ లేదుగాన 8 వ మేళము హనుమత్తోడి అని తేలినది. నఠభైరవియందు పై విధముగ ముందు సున్నకు పిమ్మట రెండు, 02 అని వచ్చును. వీటిని మార్చిన 20 అని వచ్చును. ఇది నఠ

భైరవి మేళమునకు సంఖ్య. 72 మేళములందును రెండంకెలకు మించి లేవు గాన మేళముయొక్క పేరునుండి రెండక్షరములకు మాత్రమే అంకెలను చూచుకొనవలసివచ్చినది. రెండక్షరములకు అంకెలను తెలిసినపిమ్మట ఎడమ వైపున సున్న వచ్చినది గదా దానికి విలువలేదుగదాయని తీసివేయకూడదు. ఆ రెంటిని అటుయిటు మార్చిన పిమ్మట సున్నకు విలువయేర్పడును. ఈ విధముగా మార్చినపిమ్మట ఎడమ వైపున సున్న యుండేయెడల దానికి మాత్రము విలువయుండదు.

72 మేళములలోను 1 సూర్యకాంతము 2 షణ్ముఖప్రియ 3 షడ్విధమార్గిణి 4 ధర్మవతి 5 సింహేంద్రమధ్యమము ఈ విధమగు మేళములయందు రెండవ అక్షరము సంయుక్తాక్షరము. సంఖ్యలను దెలుసుకొనుటకుగాను ఈ మేళములందు సంయుక్తాక్షరము నందలి వత్తులనే గ్రహించవలెను అప్పుడు పై మేళములందు రెండవ యక్షరమును క్రమముగా య, మ, వ, మ, మ. అను యక్షరముల ననుసరించి సంఖ్యలను దెలియవలయును.

కాని ఈ విధానము మేళముల సంఖ్య నుబట్టి పేరును దెలియుటకు అంతగా ఉపకరించదు. ఒక మేళముయొక్క సంఖ్య ననుసరించి ఆ మేళమునగల స్వరముల శ్రుతులను దెలియు విధానము చెప్పబడుచున్నది.

మేళముయొక్క సంఖ్యయందు ఆరు సంఖ్య ఎన్ని పర్యాయములు పోవునో చూడవలెను. దానినిబట్టి రి. గ. ప్రస్తార భేదములు అన్ని గడచినట్లగును. 6 వంతున తీసివేయగా లేక

భాగించగా శేషము మిగిలెనేని ఎన్ని ఆరులు పోయినవో రి. గ భేదములన్ని గడచి తరువాతనుగల రి. గ భేదములోని శ్రుతు లగును. ఆ శేషమును ధ. ని భేదములలో ఏ సంఖ్యయో ఆశ్రుతులు దానినిబట్టి తేలును. మేళసంఖ్య 36 లోగానే యున్న మధ్యమము శుద్ధమధ్యమమని స్పష్టమగును. స ప లకు మార్పేమియు ఉండదు. గాన అన్ని స్వరములు తెలసినట్లే యగును.

ఉదాహరణము

హరికాంభోజి మేళముసంఖ్య 28. ఈ మేళమునందలి స్వరములకు శ్రుతులను తెలియవలయుననిన 28 ని, 6 చేత భాగించవలెను. అప్పుడు 6 సంఖ్య 28 లో (28 ÷ 6) 4 మారులు పోగా యిక 4 మిగులును. అనగా రి. గ ప్రస్థార భేదములు నాలుగు గడచి అయిదవదానికి వచ్చినదని తాత్పర్యము. అయి దవ భేదమందు చతుశ్రుతి రిషభము, అంతర గాంధారము ఉన్నది. శేషమువచ్చిన నాలుగును ధ. ని. భేదములలో చూడవలెను. అందు నాలుగవదానిలో చతుశ్రుతి ధైవత మును, కైశికి నిషాదమును గలవు. ఈ మేళ సంఖ్య 36 కు లోగానేయున్నది గాన మధ్యమము శుద్ధమధ్యమము.

ఉదాహరణము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | చ. | అం. | శు. | | చ. | కై. | |
| 28 | స | రి | గ | మ | ప | ధ | ని | స |

ఈ ప్రకారము మేళమందలి స్వరములన్నియు తెలిచు బడినవి.

మేళసంఖ్యనుండి 6 వ వంతును తీసివేయగా శేషము మిగిలినచో ఎన్ని అసలు తీసివేయబడినవో ఆ సంఖ్యయందు రి. గ లకును, తరన భేదమందు ధ. ని లును చూచుకొనవలెను.

ఉదాహరణము

వరుణప్రియ మేళము 24 వ మేళము. ఈ మేళ సంఖ్య యందు 6 సంఖ్య (24 ÷ 6) నాలుగు పర్యాయములు పోవును. శేషము లేదు. గనుక రి. గ భేదము 4 వదియు, ధ. ని భేదము 6 వది యగును.

ఉదాహరణము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | చ. | సా. | శు. | | ష. | కా | |
| 24 | స | రి | గ | మ | ప | ధ | ని | స |

మేళముయొక్క సంఖ్య 36 కు మించియున్నపుడు అందుండి 36 ను తీసివేసి మిగిలినదానికి పైవలెనే శ్రుతులను చూచుకొనవలెను. మధ్యమము మాత్రము ఇచ్చట ప్రతిమధ్యమమని తెలియవలెను.

ఉదాహరణము

కామవర్ధని మేళసంఖ్య 51. ఇందుండి 36 ను తీసివేసిన (51—36) = 15 వచ్చును. ఈ 15 సంఖ్యామేళమునందు శుద్ధ మధ్యమమును తొలగించి ప్రతిమధ్యమమును వినియోగించిన కామవర్ధని మేళమగును. 15 మేళమునందు 6 సంఖ్య రెండు పర్యాయములుపోగా (15 ÷ 6) 3 శేషముమిగిలినది. గనుక, రి. గ. భేదములు రెండుగడచి మూడవదియు, ద. ని భేదము లల్లో మూడవదియు అగుచున్నది.

ఉదాహరణము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | శు. | అం. | శు. | | శు. | కా. | |
| 15 | స | రి | గ | మ | ప | ధ | ని | స |

ఇది మాయామాళవ గౌళమేళము. దీనియందు శుద్ధ మధ్యమమునకు బదులు ప్రతిమధ్యమమును వినియోగించిన

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | శు. | అం. | ప్ర. | | శు. | కా. | |
| 51 | స | రి | గ | మ | ప | ధ | ని | అని కామ |

వర్ధని మేళమగును.

## (6) సంపూర్ణము

సంపూర్ణములు, షాడవములు, ఔడవములు అని రాగములు మూడు విధములు. అందు ఆరోహణమందును, అవరోహణమందును సప్తస్వరములుగలది సంపూర్ణరాగము. అయితే ఆరోహణావరోహణములందు ఎచ్చటనైనను సరే సప్తస్వరములు పూర్తియైన అట్టిది సంపూర్ణమేనని కొందరి మతము. అనగా ఆరోహణమందు ఒక స్వరము లోపించియున్న ఆ స్వరము అవరోహణమందు ఉన్నచో అది సంపూర్ణమని ఆ మతముయొక్క తాత్పర్యము. అటులనే అవరోహణమందు లోపించిన స్వరము ఆరోహణమందున్నచో సంపూర్ణమేనని చెప్పబడినది. నేడుమాత్రము ఆరోహణావరోహణముల రెంటి యందును సప్తస్వరములు పూర్తిగా యుండుటయే సంపూర్ణముగా వ్యవహరింపబడుచున్నది. పైన వివరించబడిన మేళకర్తలన్నియు సంపూర్ణరాగము లగుచున్నవి.

## (7) షాడవము

ఆరుస్వరములు ఆరోహణావరోహణములందుగల రాగములు షాడవములనబడినవి. సప్తస్వరములలో ఇవి ఆరుగలవు.

ఉదాహరణము

| | ఆరోహణము | | అవరోహణము |
|---|---|---|---|
| (1) | స రి గ మ ప ధ స | = | స ధ ప మ గ రి స |
| (2) | స రి గ మ ప ని స | = | స ని ప మ గ రి స |
| (3) | స రి గ మ ధ ని స | = | స ని ధ మ గ రి స |
| (4) | స రి గ ప ధ ని స | = | స ని ధ ప గ రి స |
| (5) | స రి మ ప ధ ని స | = | స ని ధ ప మ రి స |
| (6) | స గ మ ప ధ ని స | = | స ని ధ ప మ గ స |

## (8) ఔడవము

అయిదు స్వరములు ఆరోహణావరోహణములందుగల రాగములు ఔడవములని చెప్పబడినవి. సప్తస్వరములనుండి యివి 15 పుట్టినవి.

ఉదాహరణము

| | | | |
|---|---|---|---|
| (1) | స రి గ మ ప స | = | స ప మ గ రి స |
| (2) | స రి గ మ ధ స | = | స ధ మ గ రి స |
| (3) | స రి గ మ ని స | = | స ని మ గ రి స |

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| (4) | స | రి | గ | ప | ధ | స | = | స | ధ | ప | గ | రి | స |
| (5) | స | రి | గ | ప | ని | స | = | స | ని | ప | గ | రి | స |
| (6) | స | రి | గ | ధ | ని | స | = | స | ని | ధ | గ | రి | స |
| (7) | స | రి | మ | ప | ధ | స | = | స | ధ | ప | మ | రి | స |
| (8) | స | రి | మ | ప | ని | స | = | స | ని | ప | మ | రి | స |
| (9) | స | రి | మ | ధ | ని | స | = | స | ని | ధ | మ | రి | స |
| (10) | స | రి | ప | ధ | ని | స | = | స | ని | ధ | ప | రి | స |
| (11) | స | గ | మ | ప | ధ | స | = | స | ధ | ప | మ | గ | స |
| (12) | స | గ | మ | ప | ని | స | = | స | ని | ప | మ | గ | స |
| (13) | స | గ | మ | ధ | ని | స | = | స | ని | ధ | మ | గ | స |
| (14) | స | గ | ప | ధ | ని | స | = | స | ని | ధ | ప | గ | స |
| (15) | స | మ | ప | ధ | ని | స | = | స | ని | ధ | ప | మ | స |

మిగతా విశేషములు రెండవ భాగమున వివరింపబడును.



# 4. తాళము

## (1) తాళాంగములు

అనుద్రుతము, ద్రుతము, లఘువు అను మూడు తాళాంగములు యిచ్చట వివరింపబడుచున్నవి.

### అనుద్రుతము

దీనికి రూపచిహ్నము ◡ అరసున్న ఎడమ అరచేతిలో కుడిఅరచేతితో దెబ్బకొట్టుట దీనికి వినియోగము.

ఈ హస్తక్రియ (దెబ్బ)కు ధ్రువక్రియ అని పేరు. ఘాత అను వ్యవహారముకూడ గలదు. సప్తతాళములలో ఒక ఝంప తాళమందు మాత్రమే యిది వినియోగమగుచున్నది. ఇది శబ్దక్రియ.

### ద్రుతము

దీనికి రూపచిహ్నము ౦ సున్న. అనుద్రుతమునందు వలెనే ఎడమ అరచేతిలో దెబ్బనుకొట్టి పిమ్మట దెబ్బకొట్టిన కుడిచేతిని ముందునకు విసరుట దీనికి వినియోగము. దెబ్బకు ఘాతయనియును, చేతిని ముందుకు విసరుట ఉసి అనియును సామాన్యముగ వ్యవహరించుచున్నారు. దెబ్బకు ధ్రువక్రియ యనియును, ఉసికి విసర్జితక్రియ యనియును అసలుపేర్లు. ఈ రెండు క్రియలను సమాన కాలములలో అనుష్ఠించవలెను. తాళము నడచు మార్గకాలము ననుసరించి దీని కాలము నిర్ణయ మగును. మార్గవిషయము ముందు వాచకములలో రాగలదు.

లఘువు

దీనికి రూపచిహ్నము । ఈ విధమగు నిలువుగీటు. పై అంగము లందువలెనే ఎడమ అరచేతిలో దెబ్బనుకొట్టి పిమ్మట చిటికెనవ్రేలు మొదలు వ్రేళ్లను ఎంచుట దీనికి వినియోగము. ఈ సందర్భములో ఎడమచేతి వ్రేళ్లను కుడిచేతి యొక్క ఆయా వ్రేళ్లతోనే ఎంచవలెను. ఇందు దెబ్బ (ధ్రువక్రియ) ఒకటే శబ్దక్రియ. వ్రేళ్లను ఎంచునవి నిశ్శబ్దక్రియలు.

## (2) లఘువుయొక్క జాతులు

లఘువును వేయుటకు వ్రేళ్లను ఎంతవరకు ఎంచవలయునను సంశయము కలుగును. అందులకు జాతిలక్షణములు చెప్పబడుచున్నవి.

చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణములని లఘుజాతులు అయిదు విధములు. ఈ లఘువు చతురశ్ర జాతియందు 4 క్రియలను, త్రిశ్ర జాతియందు 3 క్రియలను, మిశ్ర జాతియందు 7 క్రియలను, ఖండ జాతియందు 5 క్రియలను, సంకీర్ణ జాతియందు 9 క్రియలను కలిగియుండును. ఈ క్రియలను చతురశ్ర జాతియందు ఘాతవేసి చిటికెనవ్రేలు వరకును, అటులనే త్రిశ్ర జాతియందు అనామిక వ్రేలువరకును ఎంచవలెను. మిశ్ర జాతియందు ఈవిధము ఎంచగా వ్రేళ్లన్నియు పూర్తిగా ఎంచబడినను యింకొక క్రియ మిగులును. అప్పుడు తిరిగి చిటికెన వ్రేలిని ఎంచి ఆ కొరవను భర్తీ చేయవలెను.

ఒక పర్యాయము వ్రేళ్లనుపూర్తిగా ఎంచుటతో లఘువు నందలి క్రియలసంఖ్య పూర్తి కానపుడు తిరిగి చిటికెనవ్రేలు మొదలు ఎంచవలెను. గాని తిరిగి దెబ్బకొట్టకూడదు.

ఖండజాతి లఘువునందు పై వలెనే తర్జనీ వ్రేలివరకు ఎంచవలెను. సంకీర్ణజాతి లఘువునందు ఒక పర్యాయము వ్రేళ్లను పూర్తిచేయగా దెబ్బతోసహా 6 క్రియలగును. ఇంకా మూడు మిగిలియుండును. తిరిగి చిటికెనవ్రేలినుంచి ప్రారంభించిన మధ్యమ వ్రేలితో లఘువుసంఖ్య పూర్తియగును.

ఈ చెప్పబడిన అయిదు లఘువులలోను ఘాత ఒకటే శబ్దక్రియ. వ్రేళ్లను ఎంచునపుడు ధ్వనిపుట్టకూడదు.

## సప్త తాళములు

1 ధ్రువతాళము, 2 మఠ్యతాళము, 3 రూపకతాళము, 4 ఝంపతాళము, 5 త్రిపుటతాళము 6 అటతాళము 7 ఏకతాళము, అను ఏడుతాళములు నేడు వాడుకలోగలవు. ఈ తాళములకు సప్తతాళములని పేరు. ఇవి పైన వివరింపబడిన అను ద్రుతము, ద్రుతము, లఘువు అను తాళాంగముల వలన యేర్పడినవి.

## సప్త తాళాంగములు

| | | |
|---|---|---|
| 1 ధ్రువతాళమునకు | అంగములు | I O I I |
| 2 మఠ్యతాళమునకు | ,, | I O I |

| | | | |
|---|---|---|---|
| 3 | రూపకము | ,, | o I |
| 4 | ఝంప | ,, | I ◡ o |
| 5 | త్రిపుట | ,, | I o o |
| 6 | అట | ,, | I I o o |
| 7 | ఏక | ,, | I |

పై తాళాంగములలో లఘువు ఒకటే జాతిమార్పును పొందును. ఒక తాళమునందు ఎన్ని లఘువులున్నను మొదటి లఘువును ఏ జాతిలో వాడిన మిగతా లఘువులనుకూడ ఆ జాతిలోనే నడుపవలెను. పై తాళములందలి లఘువును ఏ జాతిలో విని యోగించుకొనిన అది ఆజాతి తాళమని పిలువబడుచున్నది. ఈ విధమున ఒక్కొక్క తాళమునందు చతురశ్ర, త్రిశ్ర, మొదలైన అయిదు జాతుల లఘువులను వేరు వేరుగా వినియోగించునపుడు ఆయా లఘువులజాతి ననుసరించి అయిదు తాళము లగుచున్నవి. సప్త తాళములు జాతిభేదమును పొందుట వలన ఒక్కొక్క తాళము అయిదేసి తాళములై మొత్తము (7 × 5) 35 తాళము లగుచున్నవి.

సప్త తాళములపేర్లు, వాటి అంగములు, జాతిభేదములు, ఒక్కొక్క జాతియందుగల హస్తక్రియల సంఖ్య, ఒక్కొక్క జాతి తాళమునకుగల పేరు దిగువ పథకమున వివరింపబడు చున్నవి.

# సప్తతాళ విమర్శన పథకము

## తాళ జాతులు

| సం | తాళముల పేర్లు | తాళాంగములు | చతురశ్ర జాతి | త్రిశ్ర జాతి | మిశ్ర జాతి | ఖండజాతి | సంకీర్ణజాతి |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ధ్రువతాళము | I O I I | 14 శ్రీకర | 11 మణి | 23 పూర్ణ | 17 ప్రమాణ | 29 భువన |
| 2 | మఠ్యతాళము | I O I | 10 సమ | 8 సార | 16 ఉదీర్ణ | 12 ఉదయ | 20 రావ |
| 3 | రూపక తాళము | O I | 6 పత్తి | 5 చక్ర | 9 కుల | 7 రాజ | 11 బాదు |
| 4 | ఝంపతాళము | I ◡ O | 7 మధుకర | 6 కదంబ | 10 సుర | 8 చణ | 12 కర |
| 5 | త్రిపుట తాళము | I O O | 8 ఆది | 7 శంఖ | 11 లీల | 9 దుష్కర | 13 భోగ |
| 6 | అటతాళము | I I O O | 12 లేఖ | 10 గుప్త | 18 లోయ | 14 విదళ | 22 ధీర |
| 7 | ఏకతాళము | I | 4 మాన | 3 సుధా | 7 రాగ | 5 రతి | 9 వసు |
| | | | I | ౩ | ౭ | ౫ | ౯ |

# 5. రాగలక్షణములు

ఈ ప్రకరణమున—

(1) మాయామాళవగౌళ, (2) మలహరి, (3) తోడి, (4) భైరవి, (5) దర్బారు, (6) మోహన, (7) కాంభోజి, (8) కమాచి, (9) ధీరశంకరాభరణము, (10) అఠాణా, (11) శుద్ధసావేరి, (12) మేచకల్యాణి, అను 12 రాగములకు లక్షణములు చెప్పబడుచున్నవి.

## 1 మాయామాళవ గౌళ రాగలక్షణము

15 వ మేళకర్తరాగము. 3 వ అగ్నిచక్రము. సంపూర్ణము. జనకరాగము.

### స్వరములు

| | |
|---|---|
| ఆరోహణము : | స రి గ మ ప ధ ని సే |
| అవరోహణము : | సే ని ధ ప మ గ రి స |

### స్వరముల శ్రుతులు

అంతర గాంధారము, కాకలి నిషాదము ఇతర స్వరములు శుద్ధములు.

### గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. గాంధారపంచమములు న్యాస స్వరములు. గాంధారనిషాదములు జీవస్వరములు. ఎల్లప్పుడును గానము చేయదగును.

## సంవాదులు

స. మ. ప. స్వరములును, రి. ధ. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

## విశేషము

ఈ మేళమునందు షడ్జమునకు రి. ని. స్వరములును, మధ్యమమునకు గ. స్వరమును, పంచమమునకు ధ. స్వరమును ద్విశ్రుతి న్యాయముతోనున్నవి. ఈ విధముగ ముఖ్య సంవాదులగు స. మ. ప. స్వరములకు సమానములగు అంతరములలో నుండి సంవాదులుగగూడ నుండుటచే అభ్యసించుటకు, సులభముగా నుండునని సరళీలు మొదలు గీతముల వరకు ముందు ఈ రాగముననే విద్యార్థులకు బోధించుచున్నారు.

ఇందు శుద్ధరిషభము, శుద్ధధైవతము అనునవి రెండు శ్రుతులుగలవి. అనగా 22 శ్రుతుల పద్ధయందు షడ్జము తరువాతను రెండవ శ్రుతియందు శుద్ధరిషభమును, పంచమము తరువాత రెండవ శ్రుతియందు శుద్ధధైవతమును వినియోగ మగుచున్నవి. అటులనే షడ్జము తరువాత 7 వ శ్రుతియందు అంతర గాంధారమును, పంచమము తరువాత 7 వ శ్రుతియందు కాకలి నిషాదమును చెప్పబడినని.

## ప్రయోగ స్వరములు

సా ని ధ, ని సా రి గ రీ — గ రి గ మ ప మ
గ మ ప ధ పా — గ మ ధ ప మ గ రి సా
ప ధ ప ని ధ ప మా — ప ధ ని సే రి సే
సే రి గే మ గే రి సే — రి సే ని ధ పా
ధ పా మ గ రి సా — స ని ధ, ని సా

## 2. మలహరి రాగలక్షణము

15 వ మేళకర్తయగు మాయామాళవ గౌళ రాగ జన్యము 3 వ అగ్నిచక్రము. ఔడవషాడవము.

స్వరములు

ఆరోహణము: స రి మ ప ధ స

అవరోహణము: స ధ ప మ గ రి స

ఆరోహణమందు గ. ని. స్వరములును, అవరోహణ మందు ని. స్వరమును వర్జ్యములు.

స్వరముల గుణములు

అంతరగాంధారము, ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

ధైవతము గ్రహస్వరము, షడ్జము న్యాసస్వరము. ప్రాతఃకాలమున గానము చేయదగును.

సంవాదులు

స. మ. ప. స్వరములును, రి. ధ. స్వరములును పర స్వరము సంవాదులు.

ప్రయోగములు

స రి మా గ రి సా – స ధ. ధ. సా – ధ స స రి – స రి మ గ రి –
గ రి మ ప ధా ప – ప మ గ రి రి స – రి రి ప మా గ రి –
మ గ రి మా పా – ప ధ స రి స – గ రి స రి రి స మ గ రి స
స ధ ప మ గ రి స – ధ. స రి మా గ రి – స రి గ రి సా.

## ౩. తోడి రాగలక్షణము

౮వ మేళకర్త రాగము. ౨వ నేత్రచక్రము. సంపూర్ణము. జనకరాగము.

### స్వరములు

ఆరోహణము: స రి గా మ ప ధ నీ సే
అవరోహణము: సే ని ధ ప మ గా రి స

### స్వరముల శ్రుతులు

సాధారణ గాంధారము, కైశికి నిషాదము, ఇతర స్వరములు శుద్ధములు.

సాధారణ గాంధారము కొంచెము తగుగా పలుకును.

### గ్రహన్యాసములు

షడ్జము గ్రహన్యాసములు. శుద్ధధైవత సాధారణ గాంధారములు ఛాయాస్వరములు, సాయంకాలమున గానము చేయదగును.

### సంవాదులు

స. మ. ప. స్వరములును, రి. ధ. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

### ప్రయోగ స్వరములు

**స రి గ మ ధ ని సా - సే ని ధ మ గ రి సా.**

అను షాడవ ప్రయోగము వలన రక్తి కలుగును.

**గ మ ధ ధ మ గా - స మా గ రి స - రి గ రి గా - ధ ని ని రి ధ గ రి.**

ఈ మున్నగు ప్రయోగములు రంజకములు.

సా ని ధ. ని - ధా. ని స రి గ మ గ రి స ని -
ధ. గ రి గ స రి - మ గ రి సా - గ రి స ని సా - గ మ పా -
ప మ గా రి సా - మ గ మ ప ధ ప మ - ధ ప మ గ మ మ గ రి సా -
రి గా మా ధా - రి గ మ ధ - మ ధ ని ధా - గ మ ధ ని సే ని ధ మ గ రి సా
ప ధ పా - ప ధ ని సా - సే రి గే రి సా - మ ధ ని రి సా - ని రి సే ని -
గే మే గే రి సే ని గే రి సే ని ధ ప - ని ధ మ గ రి స - ని ధ. ని - స రి సా.

ఈ రాగము హనుమత్తోడి యని వ్యవహరింపబడు చున్నది. మేళకర్త సంఖ్యకొరకు 'హను' అను రెండక్షరములు మొదటను చేర్చబడినవి. లక్షణములందు చెప్పబడిన కటప యాది లెక్కప్రకారము "హను" అక్షరములు 8 వ సంఖ్యను తెలుపును.

ఈ రాగమున శుద్ధరిషభము విశేషముగ మామూలు కంటెను ఒకశ్రుతి తక్కువ నాదముకలదగుచున్నది. అనగా షడ్జమునకును శుద్ధరిషభమునకును మధ్యనుగల శ్రుతియందు వినియోగమగుచున్నది. షడ్జముతరువాతను మొదటిశ్రుతినిఆశ్ర యించునని తాత్పర్యము:— మరియును గాంధారము సాధా రణగాంధారము కంటెను ఒకశ్రుతి తగ్గుగాపలుకును. ఈ శ్రుతి షడ్జముతరువాతను అయిదవది యగుచున్నది. పూర్వము యిది శుద్ధ గాంధారస్థానము.

## 4. భైరవి రాగలక్షణము

20 వ మేళకర్తయగు నఠభైరవి రాగజన్యము. 4 వ వేద చక్రము. సంపూర్ణము.

స్వరములు

ఆరోహణము : స రి గ మ ప ధ ని సా
అవరోహణము : సా ని ధ ప మ గ రి స

స్వరముల శ్రుతులు

చతుశ్శ్రుతి రిషభము, సాధారణగాంధారము, కైశికి నిషాదము ఇతర స్వరములు శుద్ధములు.

చతుశ్శ్రుతి ధైవతము ఆరోహణమందు అన్యస్వరము.

గ్రహన్యాసాదులు

ధైవతము గ్రహస్వరము. రి. గ. మ. ని. స్వరములు ఉపన్యాసములు. సాయంకాలమున గానముచేయదగును.

సంవాదులు

స. మ. ప. స్వరములును, రి. ప. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

(1) అన్యస్వర ప్రయోగములు

ప ధ ని సా – ని ధ ని స – నీ స ధ ని స.

ఈ మూన్నుగు ప్రయోగములందు కూడ ధైవతము చతుశ్శ్రుతిగా ప్రయోగింపబడుచున్నది.

(2) సాధారణ ప్రయోగములు

స గ రి గ మ ప – ని స గ రి గ మ ప మ గ రి – ని ధ ప మ ప ధ ని సా –
ప [illegible] ని ధ ని సా – రి సా ని ధ ని సా రి సా – నీ ధ పా – ధ ని సా – గా రి సా –
నీ నీ ధ. పా – ధ. ని సా – ప ధ. ని స రి గా రి సా – గ గా రి సా –

రి గ స రి గ మా–గ మ ప ధ పా – ప ధ ని ధ ని సా –ప ధ ని సరీ సా –
స ని ధ పా–స రి గ రి స ని ధ పా–ని స్ని ధ పా– మ ప ధ ప మ గా రి –
స రి మ గా రి – సా న్సీ ధ. న్సీ సా.

ఈ రాగమున అపుడపుడు గాంధారము సాధారణ గాంధారమునకంటెను ఒక శ్రుతి తక్కువగాను, నిషాదము కైశికి నిషాదమున కంటెను ఒక శ్రుతి తక్కువగాను పలుకును. ఇవి క్రమముగా షడ్జపంచమములకు తరువాతను అయిదవ శ్రుతి యందుంటున్నవి. ఈ శ్రుతి స్థానములు పూర్వము క్రమముగా శుద్ధగాంధార శుద్ధనిషాదములకు స్థానములుగా చెప్పబడినవి.

## 5. దర్బారు రాగలక్షణము

22 వ మేళకర్తయగు ఖరహరప్రియరాగ జన్యము. 4 వ వేదచక్రము. షాడవ – వక్రసంపూర్ణము.

స్వ ర ము లు

ఆరోహణము : స రి మ ప ధ ని స
అవరోహణము : స ని ధ ప మ రి గా రి స

ఆరోహణమందు గాంధారము వర్జ్యము.

స్వ ర ము ల శ్రు తు లు

చతుశ్శ్రుతి రిషభము, సాధారణ గాంధారము, చతుశ్శ్రుతి ధైవతము, కైశికినిషాదము ఇతర స్వరములు శుద్ధములు.

గ్ర హ న్యా సా దు లు

షడ్జస్వరము గ్రహన్యాసములు. గ. ని. లు జీవస్వరములు. ఎల్లప్పుడును గానముచేయదగును.

సం వా దు లు

స. మ. ప. స్వరములును, రి. ప. స్వరములును, రి. ధ. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

గ గ రి స – రి మ ప ధ = గా , , రి స – స న్ని ధ ప గ గ్గా రి స –
ధ ని స రి ని స ధ ప – నీ ధ ప మ గా రి స – ని న్ని ధ ప మ – గ గ్గా రి స –
నీ ధ ప మ – గా రి స – రి సా న్నీ స రి – గా రి స – ధ ప మ ప గ గ్గా రి స –
రీ ప్ప మ పా – మ ప ధ ప – ధ నీ సా – మా ప ధ ని స రీ సా –
గా రి స – నీ ధ ప – గా రి స – మ ప ధ ని స రి గా రి సా –
రి స నీ ధ ప – ధ రీ స రి నీ ధ ప – స రి గ గ్గా. రి స – ని న్ని ధ ప –
మ ప ధ ని ప మ రీ – గ గ్గా,రి స – న్నీ ధా. న్నీ సా.

## 6. మోహనరాగ లక్షణము

28 వ మేళకర్తయగు హరికాంభోజి రాగజన్యము. 5 వ బాణచక్రము. ఔడువరాగము.

స్వ ర ము లు

**ఆరోహణము : స రి గ ప ధ స**
**అవరోహణము : స ధ ప గ రి స**

స్వ ర ము ల కు శ్రు తు లు

చతుశ్రుతి రిషభము, అంతరగాంధారము, చతుశ్రుతి ధైవతము ఇతరస్వరములు శుద్ధములు.

గ్ర హ న్యా సా దు లు

షడ్జము గ్రహస్వరము. రి. గ. ధ. స్వరములు జీవ, న్యాసములు. ఎల్లప్పుడును గానముచేయదగును.

సంవాదులు

స. ప. స్వరములును, రి. ప. స్వరములును, రి. ధ. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

స రి గ రి స ధ. సా — గ ప గ రి స ధా. — ప ధ. స రి గా — గ ప గ రి సా —
గ ధ ప గ రి సా — ప ధ స̇ ధా ప — ధ గ̇ రి̇ గ̇ స̇ రి̇ ధ స̇ — ప ధ రి̇ స̇ —
పధ స̇ ధా ప — ధ రి̇ స̇ ధా ప — గ ప ధ రి̇ స̇ ధా ప — రి̇ స̇ గ̇ రీ̇ —
ప̇ గా̇ రి̇ సా̇ — గ̇ రీ̇ స̇ దా — రి̇ సా ధ పా — స ధా ప గ రీ —
ప గా రి సా — స ధ. రీ సా.

## 7. కాంభోజి రాగలక్షణము

28 వ మేళకర్తయగు హరికాంభోజి రాగజన్యము. 5 వ బాణచక్రము. షాడవ సంపూర్ణము.

స్వరములు

ఆరోహణము: స రి గ మ ప ధ స̇
అవరోహణము: స̇ ని ధ ప మ గ రి స

ఆరోహణమందు నిషాదము వర్జ్యస్వరము.

స్వరములకు శ్రుతులు

చతుశ్శ్రుతి రిషభము, అంతరగాంధారము, చతుశ్శ్రుతి ధైవతము, కైశికి నిషాదము. ఇతర స్వరములు శుద్ధములు.

కాకలి నిషాదము అన్యస్వరము.

గ్రహన్యాసాదులు

షడ్జస్వరము గ్రహన్యాసములు. గ. మ. ధ. ని. లు జీవస్వరములు. ఎల్లపుడును గానము చేయదగును.

సంవాదులు

స. మ. ప. స్వరములును, రి. ప. స్వరములును, రి. ధ. స్వరములును, పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

స రి మ గ రి - మ గ ప ధ సే - నీ ధ ప - మా గా ప ధ సే -
ప ధ సే నీ ధ - మ ధా ప మ - ని ధా ప మ - ప మ గ రి స - మ గ ప ధా -
ధ ని ప ధ మ ప - రి మ రి ప మ గ - మ గ మ ప ధ ప -
మ గ మ ప ని ధ - ప ని ధ సే - ధ సే రి గ - మా గా రి సే గ రి సా -
రి సే ని ధ ప - గ రి స ని ధ ప - మ గ రి సే ని ధ ప - మ గ రి సా.

కాకలీ నిషాద ప్రయోగములు.

సా ని పా ధ సా - ని ప ధ సా - సే ని ప ధ సా - స స ని ధ ధా.

ఈ రాగమందు నిషాదము ఒక్కొక్కప్పుడు కైశికి కంటెను ఒకశ్రుతి తక్కువగా పలుకును. ఇది పూర్వము శుద్ధ నిషాదమునకు స్థానము.

## 8. కమాచి రాగలక్షణము

28 వ మేళకర్తయగు హరికాంభోజి రాగజన్యము. 5 వ బాణచక్రము. వక్రషాడవ — సంపూర్ణము.

స్వరములు

ఆరోహణము : స మ గ మ ప ధ ని సే
అవరోహణము : సే ని ధ ప మ గ రి స

ఆరోహణమందు రిషభము వర్జ్యస్వరము.

స్వ ర ము ల శ్రు తు లు

చతుశ్రుతి రిషభము, అంతరగాంధారము. చతుశ్రుతి ధైవతము, కైశికి నిషాదము ఇతరస్వరములు శుద్ధములు.

గ్ర హ న్యా సా దు లు

షడ్జము గ్రహస్వరము మ. ధ. స్వరములు జీవన్యాసములు. ఎల్లప్పుడును గానముచేయదగును.

సం వా దు లు

స. మ. ప. స్వరములును, అవరోహణమునందు రి. ప. స్వరములును, రి. ధ. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్ర యో గ స్వ ర ము లు

ధా ధా – పా ధ ని̣ ధ ప – మా మా – గా మ ని ధ ని ప ని ధ పా ప మా మా –
నీ ధా ని పా ధ ప మా మా గ సా – ధా ప మా – గా రి సా –
సా ని̣ ధ̣. ని̣ సా – స మ గ మ పా – ని ధ ప మ గా మా – ని ధ ని సం రి సం నీ ధా
ప మ ధా – ని ధ నీ – సం ని రీం సాం – సం మం గం రిం సాం – సం రిం సం ని ధా –

## 9. ధీరశంకరాభరణ రాగలక్షణము

29 వ మేళకర్త రాగము. 5 వ బాణచక్రము. సంపూర్ణము. జనకరాగము.

స్వ ర ము లు

ఆరోహణము : స రి గ మ ప ధ ని సం
అవరోహణము : సం ని ధ ప మ గ రి స

స్వ ర ము ల కు శ్రు తు లు

చతుశ్రుతి రిషభము, అంతరగాంధారము, చతుశ్రుతి ధైవతము, కాకలినిషాదము, ఇతరస్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. స. గ. లు న్యాసస్వరములు. ని. గ. మ. ప. లు జీవస్వరములు. మధ్యాహ్నమునను, సాయంకాలమునను గానముచేయదగును.

సంవాదులు

స. మ. ప. స్వరములును, రి. ప. స్వరములును, రి. ధ. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగస్వరములు

స ని ధ ని సా - ని స రి గ - మ మా గ రి స - సా పా ప మ గ రీ -
రి గ మ ప ధ ని సా - స పా మ గ రి - స మా గ రి స - గ మ ప ధ -
ధ ప మా - ప ధా ని సా - ధ ని స రి - ని స ధ ని ప ధ ని సా -
మ ప ధ ని స ని ధ పా - రి రి స ని ధ పా - ధ ప మ గ రి సా -
స ధా ప మ గ రి సా - గ రి సా - ని ధ పా మ గ రి సా -
స ని స ధా ప గ మ ప గ రి సా.

ఈ రాగముయొక్క పేరు మొదట ధీర అను రెండక్షరములును మేళకర్త సంఖ్యకొరకు చేర్చబడినవి.

## 10. అఠాణా రాగలక్షణము

29 వ మేళకర్తయగు ధీరశంకరాభరణ రాగజన్యము. 5 వ బాణచక్రము. ఔడువ - వక్రసంపూర్ణము.

స్వరములు

ఆరోహణము : స రి మ ప ని సా

అవరోహణము : సా ని ధా ప మ ప గా రి స

ఆరోహణమందు గ. ధ. స్వరములు వర్జ్యములు.

స్వ ర ము ల శ్రు తు లు

చతుశ్రుతి రిషభము, అంతర గాంధారము, చతుశ్రుతి ధైవతము, కాకలి నిషాదము ఇతరస్వరములు శుద్ధములు.

సాధారణ గాంధారము, కైశికినిషాదము అన్యస్వరములు.

గ్ర హ న్యా సా దు లు

షడ్జము గ్రహస్వరము. ధ. న్యాసస్వరము. గ. ధ. లు జీవస్వరములు. ఎల్లప్పుడును గానముచేయదగును.

సం వా దు లు

స. మ. ప. స్వరములును, రి. ప. స్వరములును, ని. గ. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్ర యో గ స్వా ర ము లు

రి మ పా – గ మ ప స ని డా – స ని స ప ధ పా – ధ ధ ప మ –
ధ ప మ ప గా – గ మ ప స ని ధా – రి స ధా – ధ ప మ ప గా మ రి సా రి ని స –
స ని ధా ని స ధా – స ధా –
ని రి స ని ప – మ ప గా – మ రి స – సా ని రీ సా.

సాధారణ గాంధార ప్రయోగములు.

ప మ గా మ ప – గ గ రి స –

కైశికి నిషాద ప్రయోగములు.

ధ ధ ని ప మ పా – ప ధ – ధ ని – ని స – ప ధ ని ప.

## 11. శుద్ధసావేరి రాగలక్షణము

29 వ మేళకర్తయగు ధీరశంకరాభరణ రాగజన్యము. 5 వ బాణచక్రము. ఔడువరాగము.

స్వ ర ము లు

ఆరోహణము : స రి మ ప ధ సీ

అవరోహణము : సీ ధ ప మ రి స

గాంధార నిషాదములు వర్జ్యస్వరములు.

స్వ ర ము ల శ్రు తు లు

చతుశ్శ్రుతి రిషభము – చతుశ్శ్రుతి ధైవతము, ఇతరస్వరములు శుద్ధములు.

గ్ర హ న్యా సా దు లు

పంచమస్వరము గ్రహన్యాసములు. సాయంకాలమున గానము చేయదగును.

సం వా దు లు

స. మ. ప. స్వరములును, రి. ప. స్వరములును, రి. ధ. స్వరములును పరస్పరము సంవాదులు.

వి శే ష ము

అసలు శుద్ధసావేరి రాగమునందు రి. ధ. స్వరములు శుద్ధములు. నేడు ఈ రెండు స్వరములును చతుశ్శ్రుతులుగా మార్చుకొని 'దేవక్రి' అను రాగమునే శుద్ధసావేరి పేర గానముచేయుచున్నారు.

ప్ర యో గ ము లు

స ధ. సా స – స ధ. రీ రి – స రి మ రీ స – స రి మ ప ధా ప – మ ప ధ ధ ప –
మ ధ ప మ రి మ ప మ రి సా – రి మ ప మ ధ ప ధ సాం సం – సం రిం సాం సం –
స రిం మం రిం సాం సం – రిం రిం సం ధా ప – మ ప ధ రిం సం ధా ప – మ ధ ప మ రీ –
ధ సం ధ ధ ప ప మ మ రీ – మ ధ ప మ రీ సా – ధ. స రీ సా – ధ. స ధ. ప ధ. రీ సా.

# 12. మేచకల్యాణి రాగలక్షణము

65 వ మేళకర్తరాగము. 11 వ రుద్రచక్రము. సంపూర్ణము. జనకరాగము.

## స్వ ర ము లు

**ఆరోహణము :** స రి గ మ ప ధ ని సే

**అవరోహణము :** సే ని ధ ప మ గ రి స

## స్వ ర ము ల శ్రు తు లు

చతుశ్రుతి రిషభము, అంతరగాంధారము ప్రతి మధ్యమము – చతుశ్రుతి ధైవతము – కాకలి నిషాదము ఇతర స్వరములు శుద్ధములు.

## గ్ర హ న్యా సా దు లు

షడ్జము గ్రహస్వరము, గ. ధ. లు న్యాసస్వరములు. రి. గ. ధ. స్వరములు జీవస్వరములు. ఎల్లప్పుడును గానము చేయదగును.

## సం వా దు లు

స. ప. స్వరములును, రి. ప. స్వరములును, రి. ధ. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

## ప్ర యో గ ము లు

ని ధ. గ రీ – ని గ రి ని రీ రి – ప మ గ రి సా – గా మా పా –
గ మ గ రి సా – మ ప ధ ధ ప మ గ మ పా – మ ప ధా –
మ ధ ని సాం – ప మ గ రి గ మ ప ధ ని సాం – ని గ రి ని ధా –
గ రి ని రి – ని గ రి రి – ని రి సే సాం – మ ధ ప ధ – గ ధ ప మ గ రీ–
ప మ గ రి సా స ని గ రి రీ – ప మ గ రి సా.

దాటు స్వర ప్రయోగములు.

గా నీ - గా ధా - రీ గా - ధా రీ - ధా గా - నీ గా - ని రీ గా.

ఒకేకు స్వర ప్రయోగములు :

గ మ ధ మ గ రీ - నీ ధ మ గ రి - ధ గ రి ని ధ మ గ రీ - ధ రీ సా.

ఈరాగము పేరునందు మొదటను మేచఅను అక్షరములును కటపయాది ప్రకారము మేళకర్త సంఖ్యకొరకు చేర్చబడినది.

ఈ రాగమున గాంధార నిషాదములు రెండును అంతర, కాకలుల కంటెను ఒకశ్రుతి హెచ్చుగాపలుకును. శుద్ధమధ్యమమునకు దిగువను (అవరోహణమందు) గల మొదటి శ్రుతియందు గాంధారమును, షడ్జమునకు దిగువను (అవరోహణమందు) గల మొదటిశ్రుతియందు నిషాదమును అగుచున్నవి. వీట్లకు పూర్వము చ్యుతమధ్యమ గాంధారమనియును, చ్యుత షడ్జ నిషాదమనియును పేర్లు.



# 8. చతుర్విధ వాద్యములు

తతములు, సుషిరములు, అవనద్ధములు – ఘనములు, అని వాద్యములు నాలుగు విధములు.

## 1. తతవాద్యములు

తంత్రీయుక్తమైన (తీగెలుగల) వాద్యములు తతములు. అనగా వీణాదులు. వీనిని నేడు జంత్రవాద్యములని వ్యవహరించుచున్నారు. జంత్ర వాద్యములలో ప్రథమమున ఏర్పడినది వీణావాదమ్యు. తరువాత ఏర్పడిన వాద్యములన్నియు వీణా వాద్య ధర్మము ననుసరించియే ఏర్పడినవి.

చిత్ర, విపంచి, పినాకీ, పరివాదిని, నకుల, కిన్నరీ, మత్త కోకిల, ఆలాపినీ మొదలగునవి వీణావాద్య భేదములు. ఇవిగాక వేరురూపాదులుగల ఔదుంబరి, షట్కర్ణము, పౌణము, రావణ హస్తము, సారంగి మొదలగు తత (జంత్ర) వాద్యములు అనేకములు కాలక్రమమున ఏర్పడినవి.

వీణాదులందలి తీగలను గోళ్లచేత ధ్వనింపజేయుటచేత అట్టి నాదము నఖజమని చెప్పబడినది.

## 2. సుషిర వాద్యములు

రంధ్రములుగల వాద్యములు సుషిరములు. వంశము, పావము – పావికము, మురళి, మధుకరీ, కాహళము, తుండికి, చుక్కా, శృంగము, శంఖము మున్నగునవి సుషివాద్యముల భేదములు.

ఈ వాద్యములలో వంశవాద్యము ముఖ్యముగా చెప్ప బడినది. ఈ వాద్యమును నేడు వేణువని వ్యవహరించుచున్నారు. పై సుషిర వాద్యములలోని కాహళమను వాద్యము నేడు సన్నాయి లేక నాగస్వరము అని వ్యవహరింపబడుచున్నది.

సుషిర వాద్యములందు వాయువును పూరించుటచేత నాదము కలుగుచున్నదిగాన ఈ నాదము వాయుజ మనబడినది.

ఇంతవరకు చెప్పబడిన తతములు, సుషిరములు అను వాద్యములు మాత్రమే రాగగీతాదులను అనుష్ఠించుటకు అనుకూలములు. వీట్లయందు రాగగీతాదులు స్వరములచేత సాధింపనగును.

## 3. అవనద్ధ వాద్యములు

చర్మముచేత కట్టబడి ముఖముగల వాద్యములు అవ నద్ధములు.

పటహము, మర్దలము, హుడుక్క, కరాట, ఘటము, ఘడసము, ఢవసము, ఢక్కా, కుడుక్కా, కుడువము, రుంజా, డమరుకము, డక్కా, మణిడక్క, డక్కులీ, సెల్లుకము, ఝల్లరీ, భాణము, త్రివళి, దుందుభి, భేరీ, నిస్సాణము, తుంబ కము మున్నగునవి అవనద్ధ వాద్యముల భేదములు.

వీనిలో మర్దలము నేడు ముఖ్యమైనదిగా యున్నది. ఈ మర్దల వాద్యమునే నేడు మృదంగమని వ్యవహరించుచున్నారు.

ఈ వాద్యములయందు నాదము కలుగుటకు ముఖ్య ముగా చర్మమే కారణముగాన ఇందలి నాదము చర్మజ మన బడినది.

## 4. ఘన వాద్యములు

అభిఘాతము వలన యేదివాయించబడునో అదిఘనము.

కంచుతాళము, ఘంట, క్షుద్రఘంటికా, జయఘంటా, కమ్రా, శుక్తిపట్టము మొదలగునవి ఘన వాద్య భేదములు.

ఈ వాద్యములు లోహముచేత నిర్మింపబడిన వగులచేత వీట్ల యందలి నాదము లోహజమనబడినది. కాష్ఠ గజ్జెలు మున్నగు వానిని వాద్యములలోనికి చేర్చలేదు.

అవనద్ధవాద్యములు, ఘనవాద్యములు అక్షరముల క్రమముచేత సాధింపతగినవి. ఈ అక్షరములకు కొనుగోలు శబ్దమనియును, వాద్యాక్షరము లనియును వ్యవహరించు చున్నారు. అవి తకత కాదులు.

ఈ వాద్యములు రాగ గీతాదులను అనుష్ఠించుటకు అనుకూల పడవు. ఇవి తాళ ప్రధానములు.

ఇంతవరకు వివరింపబడిన తతాది చతుర్విధ వాద్యములను వాదనముచేయుట (వాయించుట) 1. శుష్కము, 2. గీతానుగము, 3. నృత్తానుగము, 4. ఉభయానుగము అని నాలుగు విధములు.

(1) అందు గీత, నృత్తములు లేకుండా చేయబనడి వాదనము శుష్కవాద్యము.

(2) గీతమును (గానమును) అనుసరించు వాదనము గీతానుగము.

(3) నృత్తము (నృత్యము) ను అనుసరించు వాదనము నృత్తానుగము.

(4) గీత, నృత్తముల వెంటని అనుసరించు వాదనము ఉపగానానుగము.

రాజాభిషేక మందును, యాత్రోత్సవము నందును, వివాహాది సర్వమంగళ కార్యముల యందును, ఉత్పాతము, సంభ్రమము, యుద్ధము వీటియందును, వీరరౌద్ర రసములను పొందిన నాటకముల యందును, సమస్త వాద్యములను వాయించవలెను.

స్వల్ప మంగళములయందు కొన్నిమాత్రమే వాయించ తగినవి.

ఈ వాద్యములు రసికులకును, గాయకులకును, నాట్యము చేయు వారికిని, విశ్రాంతిని కలిగించి ఉత్సాహమును కలుగ జేయుచున్నవి.

వీరులయొక్క మంగళము కొరకును, హృదయస్ఫూర్తి కొరకును, దుఃఖోన్మూలనము కొరకును ఉపయోగపడుచున్నవి.

మరియును గీత, నృత్యముల యందుండెడు లోపములను కప్పివేయుచున్నవి.

## ౫. తంబుర శ్రుతి

గానమునందు ఆధారముగ ప్రమాణముకొరకు నొక శ్రుతిని నియమించుకొనవలయును. అట్టి శ్రుతియే మధ్యస్థాయి ప్రారంభషడ్జము. గానమునందు ప్రథమమున నియమించుకొను శ్రుతినాదము (ఆధారషడ్జము) ఒకటే అయినను సహాయము

కొరకును, రక్తికొరకును ఈ ఆధారషడ్జముతోపాటు మధ్య స్థాయిపంచమమును పైషడ్జమును అనగా తారస్థాయి ప్రారంభ షడ్జమునుకూడ నిర్ణయించుకొనుచున్నారు. అందువలన శ్రుతి కూర్చుకొనుటయనిన సాధారణముగ పైవిధముగ "స ప స" లను పట్టుటయని తాత్పర్యము.

వేదగానము, లౌక్యగానము అని గానము రెండు విధములు. ఈ రెండు గానములకును అనురణనముగల రెండు వాద్యములు ఆధార శ్రుతికొరకు నిర్ణయించబడినవి. వేదగానమునకు ఆధారశ్రుతి ప్రణవము అనగా 'ఓం' అనునది. లౌక్యగానమునకు మధ్యస్థాయి ప్రారంభ షడ్జము. ఇదియే ఆధార శ్రుతి. శ్రుత్యాదులద్వారా జనరంజకము కలుగజేయుటకొరకు ఏర్పడినది లౌక్యగానము.

వేదగానమునకు ఆధార శ్రుతియైన ప్రణవమును అనుష్ఠించుటకుగాను కంచుగంటను, లౌక్యగానములలో గాత్రగానమునకును, జంత్ర వాద్య గానమునకును తంబురయను వాద్యమును ఆధారశ్రుతి కొరకు నిర్ణయించబడినది. అటులనే సుషిర వాద్యగానమునకు ఆయావాద్యముల ధర్మముగల సుషిర వాద్యమే ఆధారశ్రుతి కొరకు నిర్ణయించబడినది.

జంత్రగాత్రజ్ఞులు తంబురవంటి జంత్ర వాద్యమునుతప్ప మరియేయితర వాద్యమును శ్రుతికొరకు నిర్ణయించుకొనినను

అట్టివారికి శ్రుతిజ్ఞానము సంపూర్తినొందదు. విద్వాంసులైన వారు గత్యంతరములేక యితర వాద్యములను ఎన్నడైన శ్రుతికొరకు నిర్ణయించుకొనినను అంతప్రమాదము ఉండదు గాని విద్యార్థులు మాత్రము తంబురనే శ్రుతికొరకు నిర్ణయించుకొనవలయును. తంబుర నాదమునందు అనేక విశేషములు గలవు.

తంబురయందు గల నాలుగు తీగలలో మధ్యనుండు రెండు షడ్జతంత్రులలోను ఒక దానిని ముందు గాత్రమునకు అనుకూలమగు నటుల శ్రుతిని నిర్ణయించుకొని పిమ్మట రెండవ తంత్రియందలి శ్రుతి నాదమునుకూడ మొదట నిర్ణయించు కొనబడిన తంత్రినాదముతో సమానముగా జేయువలయును. అప్పుడు మొదటి తంత్రియందలి శ్రుతినాదమందు మనస్సులగ్నమైననేగాని రెండవదానిని దానితో సమానముగ శ్రుతి జేయుట కుదురదు. అందువలన శ్రుతి జ్ఞానము కలుగుటకు తంబురను శ్రుతిజేయుటతోనే ప్రారంభమగును. ఈ విధముగ శ్రుతిజ్ఞానము కలిగినవిద్యార్థులుతమకుచెప్పిన పాఠమును వెంటనే గుర్తించి నిరంతరము గురువు సమీపమున నుండనక్కరలేక యే దోషములులేక గానమును అభ్యసింపగలుగుదురు. మరియును స్వల్పకాలముననే ఉత్తీర్ణులగుదురు గనుక సలక్షణమైన గానము నపేక్షించువారు విధిగా తంబురనే ఆధార షడ్జముకొరకు నియమించు కొనవలయును.

తంబురయందుగల నాలుగు తీగలు ఈ దిగువపటము నందు ఉదహరించిన ప్రకారము శ్రుతి చేయబడుచున్నవి.



ఇందు 1వ తంత్రిని మంద్రపంచమ నాదములోను, 2, 3వ తంత్రులను మధ్యషడ్జనాదములోను, 4వ తంత్రిని మంద్రషడ్జనాదములోను శ్రుతి జేయవలెను.

# 9 గీతాదుల లక్షణములు

## 1. గీతము

గీతమన సామాన్యముగా గానమని తాత్పర్యము. ఇదిగాక శాస్త్రగ్రంథములందు ప్రత్యేక గీత లక్షణములు చెప్పబడినవి. కాని వానికి ఈనాడు వ్యవహారము లోపించినది. నేడు గానమును నేర్చుకొనువారు తాళాలంకారములు అయిన పిమ్మట గీతములను కొన్నిటిని అభ్యసించుచున్నారు. ఇవి పిళ్లారి గీతములని, ఘనరాగ గీతములు అని రెండువిధములుగానున్నవి.

దైవపరముగా చెప్పబడిన కీర్తనలు పిళ్లారి గీతములనబడినవి. ఈ వ్యవహారము కన్నడదేశ సాంప్రదాయము ననుసరించి వచ్చినది. అందువలన గీతమున కా పేరువచ్చినది. ఈ గీతములు పుండరీక విఠలుడను భక్తునిచే చెప్పబడినవి. నాట, గౌళ, ఆరభి, శ్రీరాగము, వరాళి మున్నగు ఘనరాగములలో చెప్పబడుటచేత కొన్ని ఘనరాగగీతము లనబడినవి. ఈ పేర్లు వీట్లకు రాగములను పురస్కరించుకొని వచ్చినవి.

పై గీతములకు ప్రత్యేకలక్షణములు ఎచ్చటను కనుపించుటలేదు. సాధారణముగా గానయోగ్యములగు రచనలన్నిటికిని గీతములనుటకలదు. సాహిత్యభాగము పూర్తిగా యున్నదిగాన గీతమనబడినదని కొందరనుచున్నారు. గాని ఆనియమము ఎచ్చటనులేదు. సాహిత్యము తక్కువయైన దానికిని, సాహిత్యము పూర్తిగాగల దానికిని గూడ గీతము లనియే శాస్త్రమునిర్ణయించుచున్నది.

మరియును పై పిళ్లారిగీతములును, ఘనరాగగీతములును పుట్టకపూర్వమే గీతమను వ్యవహారముకలదు. గీతమన పల్లవి, అనుపల్లవి, చరణము అనున్యాయమున లేనివని కొందరను చున్నారు. అట్టి నిర్ణయము ఎచ్చటను కనుపించుటలేదు. ఈనాడు అట్టి కీర్తనలు అనేకములుగలవు. కాని అవిగీతములని వ్యవహరింపబడుటలేదు. కృతులన చేయబడినవి. కీర్తనలన కీర్తింపబడునవి, తరంగములన తరంగమనుపేరుగల 12 ఆశ్వాసములతోకూడిన గ్రంథమునందలి గానయోగ్యమగు రచనల పేరు. ఈ విధముగ గానయోగ్యములగు గద్యపద్యపదములు ప్రత్యేక నామములతో వ్యవహరింపబడుచున్నను అన్నిటికిని గీతములనియే తాత్పర్యము.

## లక్షణగీతము

సాహిత్యమునందు రాగలక్షణ మంతయు వివరింపబడిన కీర్తనకు లక్షణగీతమనిపేరు. అట్టి కీర్తనను ఏ స్వరములతో ఎట్టిరాగమున గానముచేయదగునో అందలి అర్థము బోధించును. రాగలక్షణమును బోధించుటకొరకు యిట్టి గీతములు ప్రథమసోపానముగనున్నవి.

రాగలక్షణముల ననుసరించి యివి శుద్ధములని, ఛాయాలగములని, సూడలని మూడువిధములుగా చెప్పబడినవి. ఇందు సూడ అనునది దేశీయపదము. శాస్త్రమందు చెప్పబడిన ప్రకారము రాగఛాయను పొందినగీతము శుద్ధసాలగ సూడమని చెప్పబడినది. సాలగమనినను ఛాయాలగమనినను సమానార్థకములు. ఛాయాలగ పదవికారమే సాలగము. సాలగ సూడ గీతములు ధ్రువాదిసప్తతాళముల భేదములననుసరించి ఏడు

క్షేపములుగా చెప్పబడినవి. లక్షణగీతములనుబోలి రాగలక్షణము లేకయే చెప్పబడిన కీర్తనలుకూడ గీతములనబడుచున్నవి. అవియే పైఘనరాగగీతములు మున్నగునవి.

గోవిందదీక్షితులు, పైడాల గురుమూర్తి శాస్త్రి, వేంకటమఖి, గోవిందాచార్యులు, రామామాత్యుడు, పురందరదాసు మున్నగువారు గీతములను పెరగేయ రచనలనుజేసిరి. అష్టభాషాపదయుక్తమును, అయ్యా, అంవో, తియ్యా అను పదములతోను స్వరరాగములతో గానముచేయబడునది గీతమనికూడకలదు. ఇది దేశీయమైన లక్ష్యము ననుసరించి చేయబడిననిర్ణయము

## 2. స్వరజతి

స్వరజతికూడ రాగమును అభ్యసించుటకు తోడ్పడును. ఆనాడు అభినయించు నర్తకులకొరకు స్వజతులు ఏర్పడినవి. యిందలి సాహిత్యార్థముకూడ తదనుగుణ్యముగానేయుండును. వీనిలో కొన్నిమాత్రము భక్తితో దైవపరముగాచెప్పబడినవి.

శ్యామా శాస్త్రి, మెలట్టూరు వెంకట్రామశాస్త్రి, స్వాతి తిరునాళ్, వాలాజీపేట కృష్ణస్వామి భాగవతులు మున్నగువారు స్వరజతులనుచెప్పిరి.

## 3. జతిస్వరము

పల్లవి, అనుపల్లవి, చరణము న్యాయములోనుండి మాతువు (సాహిత్యము) లేక ధాతువు (స్వరము) మాత్రమే యుండి నృత్యకాలక్షేపమున కుపయుక్తమగునట్టి రచన జతిస్వరమనబడినది. జతిస్వరమనునది దేశీయమైన వ్యవహారము. దీనినడక మధ్యమకాలములోనుండును. దీనిని స్వరపల్లవి అని కూడా అందురు.

## (౩) తానము

పునరుక్తి లేని స్వరసమూహమునకు తానమని పేరు. ఈ తానములు శుద్ధములని, కూటములని రెండు విధములు.

సప్తస్వరముల నుండి పునరుక్తులు లేక క్రమయుక్తము లైన శుద్ధస్వర సమూహమునకు శుద్ధతానమని పేరు.

సప్తస్వరములనుండి పునరుక్తులులేక క్రమమును వదలి ఏర్పడిన (స్వరప్రస్తారములందలి) స్వరసమూహములకు లేక అట్టి స్వర ప్రస్తారములకు కూటతానములని పేరు.

ఈవిధముగు శుద్ధ, కూట తానములను మాత్రమే మేళ వించి ఏ దేనియొక రాగముననుసరించి రక్తికలుగునటుల పాడుట లేక వాద్యమునందనుష్ఠించుట నేడు తానమని వ్యవహరింప బడుచున్నది. ఇందు తాళముతో నిమిత్తములేదు గాని లయమాత్రము ఉండును. గాత్రముతో ఈ తానమునను ష్ఠించు వారు "అనంతా" అను పదమునుచేర్చి గానము చేయు చున్నారు.

కొందరు రాగముపై కాలమే తానమనుచున్నారు అది సరికాదు. సాధారణముగనే కొందరు రాగమును పై కాల ములో ననుష్ఠించుచున్నారు. విళంబకాలములో నిలుపలేక వారటుల చేయుచున్నారు. అంతమాత్రమున అది తానమగుట లేదు. తానముగూడ త్రికాలములలో ననుష్ఠింపవగును. రాగము ఒకటేఅయినను తానముయొక్క ధోరణికిని రాగము యొక్క ధోరణికిని నడకలో భేదాగలదు.

ఆర్చికము, గాధికము, సామికము, స్వరాంతరము, ఔడువము, షాడవము, సంపూర్ణము అని తానములు ఏడు విధములు.—

ఒక స్వరము గలది ఆర్చికము
రెండు స్వరములు గలది గాధికము
మూడు స్వరములు గలది సామికము
నాలుగు స్వరములు గలది స్వరాంతరము
అయిదు స్వరములు గలది ఔడువము
ఆరు స్వరములు గలది షాడవము
ఏడు స్వరములు గలది సంపూర్ణము

ఈ విధములందు శుద్ధ, కూట తానములు కొన్ని ఈ దిగువను ఉదహరింపబడుచున్నవి. కాని కూటతానములలో గాధిక తానము లుండవు. అందువలన అవిమాత్రము ఆరు విధములు.

**శుద్ధ తానములు**

1. సంపూర్ణము — స రి గ మ ప ధ ని
2. షాడవ తానములు — స రి గ మ ప ధ / స గ మ ప ధ ని / రి గ మ ప ధ ని
3. ఔడువ తానములు — స రి గ మ ప / స మ ప ధ ని / స రి గ ప ధ
4. స్వరాంతర తానములు — స రి గ మ / రి గ మ ప / రి మ ప ధ

**కూట తానములు**

1. సంపూర్ణ తానములు — రి స గ మ ప ని ధ / గ మ ధ ప ని రి స
2. షాడవ తానములు — స గ రి ప మ ధ / రి గ మ స ని ధ
3. ఔడువ తానములు — స మ గ ప ధ / రి స గ మ ని
4. స్వరాంతర తానములు — స గ రి మ / రి స మ గ

**శుద్ధ తానములు**

5. సామిక తానములు } స రి గ / మ ప ధ / రి మ ధ

6. గాధిక తానములు } స రి / మ ప / గ ధ

7. ఆర్చిక తానములు } స / రి / గ

**కూట తానములు**

5. సామిక తానములు } స గ రి / ధ మ ప

6. గాధిక తానములు } రి స / మ గ



# 10. వాగ్గేయకారుల చరిత్ర

## పురందర విఠలదాసు

ఈయన కర్ణాటక బ్రాహ్మణుడు. మధ్వ (ద్వైత) మతస్థుడు. కర్ణాటకభాషలో గొప్పపండితుడు. పరమ భక్తాగ్రేసరుడు. ఇతడు మొదట కోటీశ్వరుడుగా నుండెను. పండరిపురమందు వేంచేసియున్న శ్రీ పాండురంగ విఠలుస్వామి వారి భక్తుడయ్యెను. భక్త్యాతిశయము వలన విరక్తికలిగి సంగీత సాహిత్యములందు మంచి పండితుడగుటచే ఒక్కొక్క సందర్భమున చేసిన కీర్తనలచే శ్రీ పాండురంగవిఠలు స్వామియొక్క ప్రసన్నతను జెందినవాడైయుండెను. అద్భుతములైన ఇతని చరిత్రలు అనేకములుగలవు. నేటికిని సంగీతమున వాడుకలో గల పిళ్లారిగీతములను ఈ మహనీయుడే రచించెను. మధ్వమత మఠాధిపతులు వారివారి యాస్థాన దేవతాసన్నిధులందు వీరి కీర్తనలను నేటికిని పాడి కొనియాడుచున్నారు. ఈతని కీర్తనలు వేదాంతవిషయమైనవి అనేకములుగలవు. ఈ పురందరవిఠల దాసులు అహోబలుని కాలమునకు మునుపే యుండినటుల కొందరు చెప్పుచున్నారు. ఈయన సూళాదులను కీర్తనలను **రచించెను.**



# లక్ష్యము

## సూచనలు

1. గానము నభ్యసించు సమయమున సమగ్రీవ శిరఃకాయుడై కూరుచుండవలెను.
2. తాళమును వేయునపుడు చేతులనుగాని మోచేతులనుగాని కాళ్లమీద ఆనించకూడదు.
3. తాళమును కాలిమీద వేయగూడదు.
4. చేతులతో తాళమును వేయునపుడు ఎడమచేయి ఏమియు కదలకూడదు. ఎడమచేతి అర్ధచంద్రహస్తమునందు తాళమును వేయవలెను. మనిషి ఊగకూడదు, కదలకూడదు. చేతులు భుజములవద్దనుంచి కూడ కదలించకూడదు. ఉసి అను క్రియను వేయునపుడు వ్రేళ్లను ముందునకు విసరవలయును. అంతేగాని మొత్తముచేతిని వెలకిలగాచేసి ముందునకు తీసుకొని రాకూడదు.
5. గురువువద్ద పాఠము నేర్చునపుడు ఏసందర్భముననుగూడ దిక్కుల జూడకూడదు. పరాకులేక యుండవలయును.



# 11. సరళీ స్వరములు

మాయామాళవగౌళ రాగము—త్రిపుట తాళము—చతురస్రజాతి

1 స రి గ మ - ప ధ - ని స̇ । స̇ ని ధ ప - మ గ - రి స ।

2 స రి గ మ - స రి - గ మ । స రి గ మ - ప ధ - ని స̇ ।
స̇ ని ధ ప - స̇ ని - ధ ప । స̇ ని ధ ప - మ గ - రి స ।

3 స రి గ మ - స రి - స రి । స రి గ మ - ప ధ - ని స̇ ।
స̇ ని ధ ప - స̇ ని - స̇ ని । స̇ ని ధ ప - మ గ - రి స ।

4 స రి గ మ - పా - స రి । స రి గ మ - ప ధ - ని స̇ ।
స̇ ని ధ ప - మా - స̇ ని । స̇ ని ధ ప - మ గ - రి స ।

5 స రి గ మ - పా - పా । స రి గ మ - ప ధ - ని స̇ ।
స̇ ని ధ ప - మా - మా । స̇ ని ధ ప - మ గ - రి స ।

6 స రి గ మ - ప మ - గ రి । స రి గ మ - ప ధ - ని స̇ ।
స̇ ని ధ ప - మ ప - ధ ని స̇ ని ధ ప - మ గ - రి స ।

7 స రి గ మ - ప మ - ధ ప । స రి గ మ - ప ధ - ని స̇ ।
స̇ ని ధ ప - మ ప - గ మ । స̇ ని ధ ప - మ గ - రి స ।

8 స ప మ ప - గ మ - రి గ । స రి గ మ - ప ధ - ని స̇ ।
ప స̇ ని స̇ - ధ ని - ప ధ । స̇ ని ధ ప - మ గ - రి స ।

9 సా̇ ని ధ - నీ - ధ ప । ధా ప మ - పా - పా ।
గ మ ప ధ - ని ధ - ప మ । గ మ ప గ - మ గ - రి స ।

10 స̇ స̇ ని ధ - ని ని - ధ ప । ధ ధ ప మ - పా - పా ।
గ మ ప ధ - ని ధ - ప మ గ మ ప గ - మ గ - రి స ।

# 12. జంటస్వరములు

1. స స రి రి గ గ మ మ - ప ప ధ ధ - ని ని స̇ స̇ ।
స̇ స̇ ని ని ధ ధ ప ప - మ మ గ గ - రి రి స స ।

2. స స రి రి గ గ మ మ - రి రి గ గ - మ మ ప ప ।
గ గ మ మ ప ప ధ ధ - మ మ ప ప - ధ ధ ని ని ।
ప ప ధ ధ ని ని స̇ స̇ - స̇ స̇ ని ని - ధ ధ ప ప ।
ని ని ధ ధ ప ప మ మ - ధ ధ ప ప - మ మ గ గ ।
ప ప మ మ గ గ రి రి - మ మ గ గ - రి రి స స ।

3. స స రి రి గ గ రి రి - స స రి రి - గ గ మ మ ।
రి రి గ గ మ మ గ గ - రి రి గ గ - మ మ ప ప ।
గ గ మ మ ప ప మ మ - గ గ మ మ - ప ప ధ ధ ।
మ మ ప ప ధ ధ ప ప - మ మ ప ప ధ ధ ని ని ।
ప ప ధ ధ ని ని ధ ధ - ప ప ధ ధ ని ని స̇ స̇ ।
స̇ స̇ ని ని ధ ధ ని ని - స̇ స̇ ని ని - ధ ధ ప ప ।
ని ని ధ ధ ప ప ధ ధ - ని ని ధ ధ - ప ప మ మ ।
ధ ధ ప ప మ మ ప ప - ధ ధ ప ప - మ మ గ గ ।
ప ప మ మ గ గ మ మ - ప ప మ మ గ గ రి రి ।
మ మ గ గ రి రి గ గ - మ మ గ గ - రి రి స స ।

4. మ మ గ గ రి రి గ గ - స స రి రి గ గ మ మ ।
ప ప మ మ గ గ మ మ - రి రి గ గ - మ మ ప ప ।
ధ ధ ప ప మ మ ప ప - గ గ మ మ - ప ప ధ ధ ।
ని ని ధ ధ ప ప ధ ధ - మ మ ప ప - ధ ధ ని ని ।
స̇ స̇ ని ని ధ ధ ని ని - ప ప ధ ధ - ని ని స̇ స̇ ।
ప ప ధ ధ ని ని ధ ధ - స̇ స̇ ని ని - ధ ధ ప ప ।
మ మ ప ప ధ ధ ప ప - ని ని ధ ధ - ప ప మ మ ।
గ గ మ మ ప ప మ మ - ధ ధ ప ప - మ మ గ గ ।

రి రి గ గ మ మ గ గ - ప ప మ మ - గ గ రి రి ।
స స రి రి గ గ రి రి - మ మ గ గ - రి రి స స ।

5. స మ గ మ రి గ స రి - స స రి రి - గ గ మ మ ।
రి ప మ ప గ మ రి గ - రి రి గ గ - మ మ ప ప ।
గ ధ ప ధ మ ప గ మ - గ గ మ మ - ప ప ధ ధ ।
మ ని ధ ని ప ధ మ ప - మ మ ప ప - ధ ధ ని ని ।
ప స̇ ని స̇ ధ ని ప ధ - ప ప ధ ధ - ని ని స̇ స̇ ।
స̇ ప ధ ప ని ధ స̇ ని - స̇ స̇ ని ని - ధ ధ ప ప ।
ని మ ప మ ధ ప ని ధ - ని ని ధ ధ - ప ప మ మ ।
ధ గ మ గ ప మ ధ ప - ధ ధ ప ప - మ మ గ గ ।
ప రి గ రి మ గ ప మ - ప ప మ మ - గ గ రి రి ।
మ స రి స గ రి మ గ - మ మ గ గ - రి రి స స ।

## సూచనలు

1. సరళీలు, జంటలు, వీని స్వరస్థానములు బాగాకుదిరిన పిమ్మటనే క్రమముగా రెండు మూడు కాలములలో అభ్యసించవలయును.

2. ఒక్కొక్క స్వరమును ప్రత్యేకముగా శ్రుతిలో కలియునటుల అభ్యసించవలయును.

3. సరళీలను, జంటలను అన్నిటిని అభ్యసించుటకు అవకాశము లేనివారు కొన్నిటిని అభ్యసించవచ్చును.

4. స్వరస్థానములు బాగాకుదిరిన పిమ్మట స్వరాక్షరములకు బదులు స్వరనాదములను అ, ఇ, ఉ. ఎ, ఒ అను ఐదు అక్షరములచేత ప్రత్యేకముగా మూడుకాలములలోను అభ్యసించవలయును.



రి రి గ గ మ మ గ గ - ప ప మ మ - గ గ రి రి ।
స స రి రి గ గ రి రి - మ మ గ గ - రి రి స స ।

5. స మ గ మ రి గ స రి - స స రి రి - గ గ మ మ ।
రి ప మ ప గ మ రి గ - రి రి గ గ - మ మ ప ప ।
గ ధ ప ధ మ ప గ మ - గ గ మ మ - ప ప ధ ధ ।
మ ని ధ ని ప ధ మ ప - మ మ ప ప - ధ ధ ని ని ।
ప స̇ ని స̇ ధ ని ప ధ - ప ప ధ ధ - ని ని స̇ స̇ ।
స̇ ప ధ ప ని ధ స̇ ని - స̇ స̇ ని ని - ధ ధ ప ప ।
ని మ ప మ ధ ప ని ధ - ని ని ధ ధ - ప ప మ మ ।
ధ గ మ గ ప మ ధ ప - ధ ధ ప ప - మ మ గ గ ।
ప రి గ రి మ గ ప మ - ప ప మ మ - గ గ రి రి ।
మ స రి స గ రి మ గ - మ మ గ గ - రి రి స స ।

## సూచనలు

1. సరళీలు, జంటలు, వీని స్వరస్థానములు బాగాకుదిరిన పిమ్మటనే క్రమముగా రెండు మూడు కాలములలో అభ్యసించవలయును.

2. ఒక్కొక్క స్వరమును ప్రత్యేకముగా శ్రుతిలో కలియునటుల అభ్యసించవలయును.

3. సరళీలను, జంటలను అన్నిటిని అభ్యసించుటకు అవకాశము లేనివారు కొన్నిటిని అభ్యసించవచ్చును.

4. స్వరస్థానములు బాగాకుదిరిన పిమ్మట స్వరాక్షరములకు బదులు స్వరనాదములను అ, ఇ, ఉ, ఎ, ఒ అను ఐదు అక్షరములచేత ప్రత్యేకముగా మూడుకాలములలోను అభ్యసించవలయును.



# 14. తగ్గుస్థాయి స్వరములు

1. స̇ ని ధ ప  మ గ రి స – సా̇ ;  సా̇ ;
గ రి స ని̣  స రి గ మ – స రి గ మ  ప ధ ని స̇

2. స̇ ని ధ ప  మ గ రి స – సా̇ ;  సా̇ ;
గ రి స ని̣  స స ని̣ స – స ని̣ స రి  గ మ ప మ
గ రి స ని̣  స రి గ మ – స రి గ మ  ప ధ ని స̇

3. స̇ ని ధ ప  మ గ రి స – సా̇ ;  సా̇ ;
గ రి స ని̣  ధ ని̣ స రి – స ని̣ స రి  గ మ ప మ
గ రి స ని̣  స̇ స̇ ని̣ స – స ని̣ స రి  గ మ ప మ
గ రి స ని̣  స రి గ మ – స రి గ మ  ప ధ ని స̇

4. స̇ ని ధ ప  మ గ రి స – సా̇ ;  సా̇ ;
గ రి స ని̣  ధ ప̣ ధ ని̣ – స ని̣ స రి  గ మ ప మ
గ రి స ని̣  ధ ని̣ స రి – స ని̣ స రి  గ మ ప మ
గ రి స ని̣  స స ని̣ స – స ని̣ స రి  గ మ ప మ

5. స̇ ని ధ ప  మ గ రి స – సా̇ ;  సా̇ ;
గ రి స ని̣  ధ ప̣ మ ప̣ – ధ ని̣ స రి  గ మ ప మ
గ రి స ని̣  ధ ప̣ ధ ని̣ – స ని స రి  గ మ ప మ
గ రి స ని̣  ధ ని̣ స రి – స ని̣ స రి  గ మ ప మ
గ రి స ని  స స ని̣ స – స ని̣ స రి  గ మ ప మ
గ రి స ని  స రి గ మ – స రి గ మ  ప ధ ని స



# 15. దాటుస్వరములు

1. స మ గ మ  రి గ స రి – రి ప మ ప  గ మ రి గ
గ ధ ప ధ  మ ప గ మ – మ ని ధ ని  ప ధ మ ప
ప స ని స̇  ధ ని ప ధ – ధ రి̇ స̇ రి̇  ని స̇ ధ ని
ని గ̇ రి̇ గ̇  స̇ రి̇ ని స̇ – స̇ ప ధ ప  ని ధ స̇ ని
ని మ ప మ  ధ ప ని ధ – ధ గ మ గ  ప మ ధ ప
ప రి గ రి  మ గ ప మ – మ స రి స  గ రి మ గ
గ ని̣ స ని̣  రి స గ రి – రి ధ̣ ని̣ ధ̣  స ని̣ రి స

2. స రి స గ  రి గ స రి – రి గ రి మ  గ మ రి గ
గ మ గ ప  మ ప గ మ – మ ప మ ధ  ప ధ మ ప
ప ధ ప ని  ధ ని ప ధ – ధ ని ధ స  ని స ధ ని
ని స̇ ని రి̇  స̇ రి̇ ని స̇ – స̇ ని స̇ ధ  ని ధ స̇ ని
ని ధ ని ప  ధ ప ని ధ – ధ ప ధ మ  ప మ ధ ప
ప మ ప గ  మ గ ప మ – మ గ మ రి  గ రి మ గ
గ రి గ స  రి స గ రి – రి స రి ని  స ని రి స

3. స స రి రి - స స గ గ - స స మ మ - గ గ రి రి
స స రి రి - గ స రి గ - స స రి రి - గ గ మ మ
రి రి గ గ - రి రి మ మ - రి రి ప ప - మ మ గ గ
రి రి గ గ - మ రి గ మ - రి రి గ గ - మ మ ప ప
గ గ మ మ - గ గ ప ప - గ గ ధ ధ - ప ప మ మ
గ గ మ మ - ప గ మ ప - గ గ మ మ - ప ప ధ ధ
మ మ ప ప - మ మ ధ ధ - మ మ ని ని - ధ ధ ప ప
మ మ ప ప - ధ మ ప ధ - మ మ ప ప - ధ ధ ని ని

ప ప ధ ధ - ప ప ని ని - ప ప స̇ స̇ - ని ని ధ ధ

ప ప ధ ధ - ని ప ధ ని - ప ప ధ ధ - ని ని స̇ స̇

స̇ స̇ ని ని - స̇ స̇ ధ ధ - స̇ స̇ ప ప - ధ ధ ని ని

స̇ స̇ ని ని - ధ స̇ ని ధ - స̇ స̇ ని ని - ధ ధ ప ప

ని ని ధ ధ - ని ని ప ప - ని ని మ మ - ప ప ధ ధ

ని ని ధ ధ - ప ని ధ ప - ని ని ధ ధ - ప ప మ మ

ధ ధ ప ప - ధ ధ మ మ - ధ ధ గ గ - మ మ ప ప

ధ ధ ప ప మ ధ ప మ - ధ ధ ప ప - మ మ గ గ

ప ప మ మ - ప ప గ గ - ప ప రి రి - గ గ మ మ

ప ప మ మ - గ ప మ గ - ప ప మ మ - గ గ రి రి

మ మ గ గ - మ మ రి రి - మ మ స స - రి రి గ గ

మ మ గ గ - రి మ గ రి - మ మ గ గ - రి రి స స ||



# 16. అలంకారములు

## (1) ధ్రువతాళము |O||

| చతురశ్ర జాతి | లఘువు । | ద్రుతము O | లఘువు । | లఘువు । | 14 క్రియలు |
|---|---|---|---|---|---|
| | స రి గ మ | గ రి | స రి గ రి | స రి గ మ | |
| | రి గ మ ప | మ గ | రి గ మ గ | రి గ మ ప | |
| | గ మ ప ధ | ప మ | గ మ ప మ | గ మ ప ధ | |
| | మ ప ధ ని | ధ ప | మ ప ధ ప | మ ప ధ ని | |
| | ప ధ ని స̇ | ని ధ | ప ధ ని ధ | ప ధ ని స̇ | |
| | స̇ ని ధ ప | ధ ని | స̇ ని ధ ని | స̇ ని ధ ప | |
| | ని ధ ప మ | ప ధ | ని ధ ప ధ | ని ధ ప మ | |
| | ధ ప మ గ | మ ప | ధ ప మ ప | ధ ప మ గ | |
| | ప మ గ రి | గ మ | ప మ గ మ | ప మ గ రి | |
| | మ గ రి స | రి గ | మ గ రి గ | మ గ రి స | |

## (2) మఠ్యతాళము |O|

| చతురశ్ర జాతి | లఘువు । | ద్రుతము O | లఘువు । | 10 క్రియలు |
|---|---|---|---|---|
| | స రి గ రి | స రి | స రి గ మ | |
| | రి గ మ గ | రి గ | రి గ మ ప | |
| | గ మ ప మ | గ మ | గ మ ప ధ | |
| | మ ప ధ ప | మ ప | మ ప ధ ని | |
| | ప ధ ని ధ | ప ధ | ప ధ ని స̇ | |
| | స̇ ని ధ ని | స̇ ని | స ని ధ ప | |
| | ని ధ ప ధ | ని ధ | ని ధ ప మ | |
| | ధ ప మ ప | ధ ప | ధ ప మ గ | |
| | ప మ గ మ | ప మ | ప మ గ రి | |
| | మ గ రి గ | మ గ | మ గ రి స | |

## (3) రూపకతాళము 0 |

| చతురశ్ర జాతి | ద్రుతము O | లఘువు \| | 6 క్రియలు |
|---|---|---|---|
| | స రి | స రి గ మ | |
| | రి గ | రి గ మ ప | |
| | గ మ | గ మ ప ధ | |
| | మ ప | మ ప ధ ని | |
| | ప ధ | ప ధ ని సˆ | |
| | సˆ ని | సˆ ని ధ ప | |
| | ని ధ | ని ధ ప మ | |
| | ధ ప | ధ ప మ గ | |
| | ప మ | ప మ గ రి | |
| | మ గ | మ గ రి స | |

## (4) ఝంపతాళము | ◡ 0

| మిశ్ర జాతి | లఘువు \| | అనుద్రుతము ◡ | ద్రుతము O | 10 క్రియలు |
|---|---|---|---|---|
| | స రి గ స రి స రి | గ | మా | |
| | రి గ మ రి గ రి గ | మ | పా | |
| | గ మ ప గ మ గ మ | ప | ధా | |
| | మ ప ధ ప ప మ ప | ధ | నీ | |
| | ప ధ ని ప ధ ప ధ | ని | సాˆ | |
| | సˆ ని ధ సˆ ని సˆ ని | ధ | పా | |
| | ని ధ ప ని ధ ని ధ | ప | మా | |
| | ధ ప మ ధ ప ధ ప | మ | గా | |
| | ప మ గ ప మ ప మ | గ | రీ | |
| | మ గ రి మ గ మ గ | రి | సా | |

## (5) త్రిపుటతాళము (ఆది) 00

| చతురశ్ర జాతి | లఘువు I | ద్రుతము O | ద్రుతము O | 8 క్రియలు |
|---|---|---|---|---|
| | స రి గ రి | స రి | గ మ | |
| | రి గ మ గ | రి గ | మ ప | |
| | గ మ ప మ | గ మ | ప ధ | |
| | మ ప ధ ప | మ ప | ధ ని | |
| | ప ధ ని ధ | ప ధ | ని స̇ | |
| | స̇ ని ధ ని | స̇ ని | ధ ప | |
| | ని ధ ప ధ | ని ధ | ప మ | |
| | ధ ప మ ప | ధ ప | మ గ | |
| | ప మ గ మ | ప మ | గ రి | |
| | మ గ రి గ | మ గ | రి స | |

## (6) త్రిపుటతాళము 100

| తిశ్ర జాతి | లఘువు I | ద్రుతము O | ద్రుతము O | 7 క్రియలు |
|---|---|---|---|---|
| | స రి గ | స రి | గ మ | |
| | రి గ మ | రి గ | మ ప | |
| | గ మ ప | గ మ | ప ధ | |
| | మ ప ధ | మ ప | ధ ని | |
| | ప ధ ని | ప ధ | ని స̇ | |
| | స̇ ని ధ | స̇ ని | ధ ప | |
| | ని ధ ప | ని ధ | ప మ | |
| | ధ ప మ | ధ ప | మ గ | |
| | ప మ గ | ప మ | గ రి | |
| | మ గ రి | మ గ | రి స | |

## (3) రూపకతాళము O|

| చతురశ్ర జాతి | ద్రుతము O | లఘువు \| | 6 క్రియలు |
|---|---|---|---|
| | స రి | స రి గ మ | |
| | రి గ | రి గ మ ప | |
| | గ మ | గ మ ప ధ | |
| | మ ప | మ ప ధ ని | |
| | ప ధ | ప ధ ని సం | |
| | సం ని | సం ని ధ ప | |
| | ని ధ | ని ధ ప మ | |
| | ధ ప | ధ ప మ గ | |
| | ప మ | ప మ గ రి | |
| | మ గ | మ గ రి స | |

## (4) ఝంపతాళము |◡O

| మిశ్ర జాతి | లఘువు \| | అనుద్రుతము ◡ | ద్రుతము O | 10 క్రియలు |
|---|---|---|---|---|
| | స రి గ స రి స రి | గ | మా | |
| | రి గ మ రి గ రి గ | మ | పా | |
| | గ మ ప గ మ గ మ | ప | ధా | |
| | మ ప ధ ప ప మ ప | ధ | నీ | |
| | ప ధ ని ప ధ ప ధ | ని | సాం | |
| | సం ని ధ సం ని సం ని | ధ | పా | |
| | ని ధ ప ని ధ ని ధ | ప | మా | |
| | ధ ప మ ధ ప ధ ప | మ | గా | |
| | ప మ గ ప మ ప మ | గ | రీ | |
| | మ గ రి మ గ మ గ | రి | సా | |

## (5) త్రిపుటతాళము (ఆది) 100

| చతురశ్ర జాతి | లఘువు I | ద్రుతము O | ద్రుతము O | 8 క్రియలు |
|---|---|---|---|---|
| | స రి గ రి | స రి | గ మ | |
| | రి గ మ గ | రి గ | మ ప | |
| | గ మ ప మ | గ మ | ప ధ | |
| | మ ప ధ ప | మ ప | ధ ని | |
| | ప ధ ని ధ | ప ధ | ని స̇ | |
| | స̇ ని ధ ని | స̇ ని | ధ, ప | |
| | ని ధ ప ధ | ని ధ | ప మ | |
| | ధ ప మ ప | ధ ప | మ గ | |
| | ప మ గ మ | ప మ | గ రి | |
| | మ గ రి గ | మ గ | రి స | |

## (6) త్రిపుటతాళము 100

| తిశ్ర జాతి | లఘువు I | ద్రుతము O | ద్రుతము O | 7 క్రియలు |
|---|---|---|---|---|
| | స రి గ | స రి | గ మ | |
| | రి గ మ | రి గ. | మ ప | |
| | గ మ ప | గ మ | ప ధ | |
| | మ ప ధ | మ ప | ధ ని | |
| | ప ధ ని | ప ధ | ని స̇ | |
| | స̇ ని ధ | స̇ ని | ధ ప | |
| | ని ధ ప | ని ధ | ప మ | |
| | ధ ప మ | ధ ప | మ గ | |
| | ప మ గ | ప మ | గ రి | |
| | మ గ రి | మ గ | రి స | |

## (౭) అటతాళము ।।OO

| ఖండ జాతి | లఘువు । | లఘువు । | ద్రుతము O | ద్రుతము O | 14 క్రియలు |
|---|---|---|---|---|---|
| | స రీ గా | సా రి గా | మా | మా | |
| | రి గా మా | రీ గ మా | పా | పా | |
| | గ మా పా | గా మ పా | ధా | ధా | |
| | మ పా ధా | మా ప ధా | నీ | నీ | |
| | ప ధా నీ | పా ధ నీ | సాం | సాం | |
| | సం నీ ధా | సాం ని ధా | పా | పా | |
| | ని ధా పా | నీ ధ పా | మా | మా | |
| | ధ పా మా | ధా ప మా | గా | గా | |
| | ప మా గా | పా మ గా | రీ | రీ | |
| | మ గా రీ | మా గ రీ | సా | సా | |

## (౮) ఏకతాళము ।

| చతురశ్ర జాతి | లఘువు । | 4 క్రియలు |
|---|---|---|
| | స రి గ మ | |
| | రి గ మ ప | |
| | గ మ ప ధ | |
| | మ ప ధ ని | |
| | ప ధ ని స | |
| | స ని ధ ప | |
| | ని ధ ప మ | |
| | ధ ప మ గ | |
| | ప మ గ రి | |
| | మ గ రి స | |

## (9) ఏకతాళము–సంకీర్ణజాతి

| | | |
|---|---|---|
| సంకీర్ణ జాతి | లఘువు<br>I | 9<br>క్రియలు |

స రి గ మ ప ధ ని స̇ రి̇
రి̇ స̇ ని ధ ప మ గ రి స

1. ఈ అలంకారములు మూడుకాలములలోను సాధక చేయవలెను.

2. పిమ్మట మూడుస్థాయిలలోకూడ త్రికాలములలోను సాధకచేయవలెను,

3. గాత్రమునందు మూడుస్థాయిలు, పలుకనిచో అవరోహణమునందు ఏస్థానమునుండి పలికిన ఆ స్థానమునుండి ప్రారంభించి ఆరోహణమునందు ఎంతవరకుపలికిన అంతవరకు సాధిక చేయవలెను.

---

# 17. గీతములు

## (1) మలహరిరాగము – రూపకతాళము – చతురశ్రజాతి

అతిచిత్రతమమార్గము – సమగ్రహము

---

మ ప - ధ సీ సీ రీ । రీ సీ - ధ ప మ ప । రి మ - ప ధ మ ప
శ్రీ ఇ - గ ణ నాథ । సింధు - ఊ ర వ ర్ణ । క రు - ణ సా గ ర

ధ ప - మ గ రి స । స రి - మా గ రి । స రి - గ రి సా
క రి - వ ద అ న । లం - బో ద ర । ల కు - మి క రా

రి మ - ప ధ మ ప । ధ ప - మ గ రి స॥
అం - బా సు త । అ మ - ర వి ను త॥

మ ప - ధ సీ సీ రీ । రీ స - ధ ప మ ప । రి మ - ప ధ మ ప
సి ద్ధ - చా ర ణ । గ ణ - సే వి త । సి ద్ధి - వి నా య క

ధ ప - మ గ రి స । స రి - మా గ రి । స రి - గ రి సా
తే ఎ - న మొ న మొ । లం - బో ద ర । ల కు - మి క రా

రి మ - ప ధ మ ప । ధ ప - మ గ రి స॥
అం - బా సు త । అ మ - ర వి ను త॥

మ ప - ధ సీ సీ రీ । రీ సీ - ధ ప మ ప । రి మ - ప ధ మ ప
స క - ల వి ద్యా । ఆ ది - పూ జి త । స ఆ - ర్వో త్త మ

ధ ప - మ గ రి స । స రి - మా గ రి । స రి - గ రి సా
తే - న మొ న మొ । లం - బో ద ర । ల కు - మి క రా

రి మ - ప ధ మ ప । ధ ప - మ గ రి స॥
అం - బా సు త । అ మ - ర వి ను త॥

—✱—

## (2) మలహరిరాగము – రూపకతాళము – చతురశ్రజాతి

అతిచిత్రతమమార్గము – సమగ్రహము

ధప - మగరిస । రిమ - పధమప । ధరీ - రీసధప । ధప - మగరిస
కుంద - గౌరగౌరి । గౌరి - రివర । మంది - రఅయ । మఅ - నమకుట
సా - రీరీ । ధప - మగరిస । సరి - మాగరి । సరి - గరిసా॥
మం - దారా । కుసు - మఅకర । మక - రందం । వఅ - సితువా॥

ధప - మగరిస । రిమ - పధమప । ధరీ - రీసధప । ధప - మగరిస
హేమ - కుటకూట । సిం - హాసన । విరు - పఅఅక్ష । కరు - ణఅకర
సా - రీరీ । ధప - మగరిస । సరి - మాగరి । సరి - గరిసా॥
మం - దారా । కుసు - మఅకర । మక - రందం । వఅ - సితువా॥

ధప - మగరిస । రిమ - పధమప । ధరీ - రీసధప । ధప - మగరిస
చంద - మఅ అమ । మం - దఅకిని । మంది - రఅఅయ । మఅ - నమకుట
సా - రీరీ । ధప - మగరిస । సరి - మాగరి । సరి - గరిసా॥
మం - దారా । కుసు - మఅకర । మక - రందం । వఅ - సితువా॥

—★—

## (3) మలహరిరాగము – త్రిపుటతాళము – త్రిశ్రజాతి

అతిచిత్రతమమార్గము – సమగ్రహము

ధసస - ధపమప । ధధప - మమపా । ధధసీ - ధపమప । ధధప - మగరిస
కెరయ - నీఇరను । కెరుగ - జఅల్లీ । పరవ - పడదవ । రంతి - కఅణిరో
సరిరి - సరిసరి । ధధప - మగరిస । ధపధ - సాధప । ధధప - మగరిస॥
అరియ - కరుణద । శిఅద - భఅగ్యవు । హరిస - మార్పణ । మాడి - బ్రతికెరు॥

ధసీసీ - ధపమప । ధధప - మమపా । ధధసీ - ధపమప । ధధప - మగరిస
శ్రీఇపు - రందర । విఠల - రాయా । చరణ - కమలవ । నోడి - బ్రతికెరు
సరిరి - సరిసరి । ధధప - మగరిస । ధపధ - సాధప । ధధప - మగరిస॥
అరియ - కరుణద । శిఅద - భఅగ్యవు । హరిస - మార్పణ । మాడి - బ్రతికెరు॥

—★—

## (4) మలహరిరాగము — త్రిపుటతాళము — త్రిశ్రజాతి

### అతిచిత్రతమమార్గము — సమగ్రహము

---

రిసధ - సాసా | మగరి - మమపా | సధా - ధపమప | ధధప - మగరిస
పమమ - నాధా | పరమ - పురుషా | పరం - జ్యోఒఒతి | స్వరుడు - పఅఅఅ
విమల - వంద్యా | విమల - చరితా | విహం - గఅఅధి | రోఒహ - ణఅఅఅ

పమప - ధసీధసీ | రిసీధ - ధసీధప | ధధప - పాపమ | రిమమ - పాపా
ఉదధి - నివఅస | ఉరగ - శయఅన | ఉ. న్న - తోన్నత | మహి, - మా
ధధప - పాపమ | రీమ - మగరిస | సాస - ధధధప | పాప - మగరిస ||
యదుకు - లోత్తమ | యజ్ఞ - ర, క్షక | యజ్ఞ - శి, క్షక | రామ - నఅఅమ ||

ధసా - ధపమప | ధధప - మగరిస | రిసా - ధపమప | ధధప - మగరిస
పఖీ - మణపా, | లక, - నమొనమొ | ఇభ, - వరదా | యక, - నమొనమొ
పమప - ధసీధసీ | రిసీధ - ధసీధప | ధధప - పాపమ | రిమమ - పాపా
శుభ,, - ప్రదసుమ | నోర - ధఅయసు | రేంద్ర - మనోఒ | రంజ - నాఅ
ధధప - పాప్పమ | రీమ - మగరిస | సాస - ధధధప | పాప - మగరిస ||
అఖి, - నఅవపు | రంద - రఅఅవి | తాల్ల - భ,ల్లరే | రామా - నామా ||

—★—

## (5) మోహనరాగము — రూపకతాళము — చతురశ్రజాతి

### అతిచిత్రతమమార్గము — సమగ్రహము

---

గగ - పాపా | ధప - సాసా | రిసి - ధధపా
వర - వీణా | మృదు - పాణీ | వన - రుహలో
ధప - గగరీ | గప - ధసధా | ధప - గగరీ
చన - రాణీ | సురు - చిరబం | భర - వేణీ
గగ - ధపగా | పగ - గరిసా | గగ - గగరిగ
పుర - సుతక | ల్యాఅఅణీ | నిరు - పమశుభ

ప గ - పా పా । గ గ - ధ ప ధా । ధ ప - సాం సాం
గు ణ - లో లా । ని ర - తే జ యా । ప్ర ద - శీ లా

ధ గం - రిం రిం సం సం । ధ సం - ధ ధ ధ ప । గ ప - ధ స ధ ప
వ ర - జా ప్రి య । రం గ - నా య కి । వా ం - ఛి త ఫ ల

ధ ప - గ గ రి స । స రి - గా గా । గ రి - ప గ రీ
దా - అ అ య కి । స ర సి జా । స వ - జ న నీ

స రి - స గ రి స । గ రి - సా సా ॥
జ య - జ య జ య । ప్ర ద - శీ లా ॥

## (6) కల్యాణిరాగము—త్రిపుటతాళము—త్రిశ్రజాతి

### అతిచిత్రతమమార్గము — సమగ్రహము

---

సం సం సం - ని ధ - ని సం । ని ధ ప - ధ ప మ ప
క మ ల - జా ద ళ । వి మ ల - సు న య న

గ మ ప - ప ధ - ధ ని । ధ ప మ - ప గ - రి స
క రి వ - ర ద క రు । ణా ం బు - ధే ఎ - ఎ ఎ

ధ ధ ధ - గ గ - గా । మ పా - మ గ - రి స
క రు ణ - శ ర - ధే । క మ, - ల అ - అ అ

రీ , - సా - ; । గ మ ప - మ ప ధ ప
కా ం - తా - ; । కే శి - న ర - కా

ని ధ ప - ధ ప - మ ప । గ మ ప - ప ధ - ధ ని
సు ర వి - భే - ధ న । వ ర ద - వే - లా

ధ ప మ - ప గ - రి స । ధ ధ ధ - గ గ - గా
సు ర పు - రో - త్త మ । క రు ణ - శ ర - ధే

మ పా - మ గ - రి స । రీ , - సా - ;
క మా - ల అ - అ అ । కా ం - తా ;

గ ప ప ధ - ధ స స రి । రి ప మ గ - రి గ - రి స
అ అ అ అ - అ అ - అ అ । అ అ అ ఆ - అ అ - అ అ

స రి స స - ని ని - ధ ప । ధ ధ ప మ - గ మ - పా
వై ఇ త్య కు - లాం - త క । పా వ న - మూ - ర్తే

గ ప ధ స - ని ని - ధ ప । ధ ధ ప ప - మ గ - రి స
ప ద శు భ - రే - ఎ ఖ । మ క ట మ-యూ - ర ,

## (9) శంకరాభరణరాగము – మత్యతాళము–చతురశ్రజాతి

అతిచిత్రతమ మార్గము – సమగ్రహము

స ని సా – ధ ని – స ని ధ ప । మ గ మ ప – ధ ప – మ గ రి స
గో విం – దా – అ అ అ అ । హ రే ఎ ఎ – మ ధు – సూ ద న

స స పా – మ గ – మ రి గా । స స సా – ని స – ధ నీ సి
వ న మా – అ అ – అ అ లా । గ రు డ – ధ్వజ – ము కుంద

రీ సి ని – ధ ని – స ని ధ ప । సా సా – సా – స ని ధ ప
శ్రీ ధ ర – శ్రీ – ర ఘు ప తె । సం , , – , , – క ర ణ ణ

మ గ మ ప – , ప – మ గ రి స । రి రి ని స – స ధ – ని ని ప ధ
సుం ద రా – ం గ – జ య జ య । శ్రీ ఇ ఇ రా – అ అ – మా అ అ శి

ధ మ ప ప – గ మ – మ రి గా । స రి గ మ – పా – ధ ని సా
ఇ ఇ తా అ – భి రా – అ అ మా । మా అ అ – అం – పా హే

రి రి సి ని – ధ ప – మ గ రి స ॥
ప అ ట్ట అ – అ భి రా అ అ మ ॥

గీతములను మూడు కాలములలోను సాధికచేయవలెను.

# 18. స్వరజతులు

## (1) సాంబశివ

ఖమాచిరాగము – త్రిపుటతాళము – చతురశ్రజాతి

చిత్రతర మార్గము – సమగ్రహము

ఆరోహణము: స మ గ మ ప ధ ని స

అవరోహణము: స ని ధ ప మ గ రి స

| | | |
|---|---|---|
| ప. సా ; సా నీ ధా పా , మ గా | మా ; ; గా | మా పా , ధా ని\|\| |
| సాం బా శి వ య న | వే రా | జి త గి రి\|\| |
| చ. సా , రి నీ , స ధా , ని పా , ధ | మా , ప మా , గ | మా , ప ధా , ని\|\| |
| శాం భ వీ మ నో హ రా ప | రా త్ప రా శు | భా క రా శ్రీ \|\|సాం\|\| |
| 2. సా రీ స ని నీ సా ని ధ ధా నీ | ధ ప మా ధా మ గ | స మా గ మ ప ధ ని\|\| |
| నీ వే గు రు దై వం బ ని ఏ వే | ళ ను సే విం పు చు | స దా మ ది ని శి వ \|\|సాం\|\| |
| 3. స రి స ని సా ; ని స ని ధ నీ ; | ధ ని ద ప ధా ; | ప ధ ప మ పా ;\|\| |
| ప ర మ ద యా ని ధి వ ను చు | మ రు వ క నా | హృ ద య ము న \|\| |
| స స స స మ మ మ మ ప ప ప ప ధ ధ ధ ధ | ని స ని స ని ధ పా | ధ ప మ గ మ ప ధ ని\|\| |
| మహాదేవ మహాప్రభు సుందర నా య క | సు ర వ ర దా య కా | భ వ భ య హ ర శి వ \|\|సాం\|\| |
| 4. ధ స ని ధ ప మ గ మ పా ; ప ధ ని ధ | ప మ గ గ మా ; | స ని ధ ని ధ ప ధ ని\|\| |
| శ్రీ ర మ ణు గ పు ర ము నా వ ర ము లొ | స గు హ రు నీ | ని ర త ము ను ద ల చి \|\|సాం\|\| |

# 19. తానవర్ణములు

## (1) తోడిరాగము

త్రిపుటతాళము – చతురశ్రజాతి (ఆది)

చిత్రతరమార్గము – సమగ్రహము

ఆరోహణము : స రి గ మ ప ధ ని సఀ

అవరోహణము : సఀ ని ధ ప మ గ రి స

పల్లవి :– ఏరనాపైని ఇంతచౌకసేయ మేరగాదురా నాసామి

అనుపల్లవి :– మారునిగన్న శ్రీవెంకటేశ సుకుమార నన్నేలుకోర సరసుడా

చరణము :– దానిమాటలు విని ఇంతసాహసమేలగ

| | I | O | O |
|---|---|---|---|
| పల్లవి | సాఀ , సఀ – ని ధ ప ధ – ని ని ధ ప – మ గ మ ని | ధ స స మ – గ రి స రి | గ మ ప గ – మ ప ధ ని |
| | ఏ గ – . . నా . – . పై . . – ని . ఇంత | చౌ . . క . . సే . | . . . యు . . . . |
| | సఀ రిఀ గఀ రిఀ – సఀ ని ధ ని – సఀ ని ధ ప – మ గ మ ని | ధా ; – ; సఀ ని | ధ ప మ గ – మ ప ధ ని |
| | మే . . ర . . గా . . . దు . రా . . . | నా సా . | . . . మి . . . . |

| | । | ○ | ○ |
|---|---|---|---|
| అను పల్లవి | ని ధ ధ ని - ధ ప మ గ - మ ని ధ మ - గ రి స మ<br>మా . . . రు . . ని . గ . . న్న . శ్రీ<br>ధ ని సా రి - గ రి స గ - రి సా ని - ని ధ ని స<br>మా . . . ర . న . . న్నే . . లు . . | గ మ ప ధ - ని ని ధ ప<br>. . వెం . . . క ట<br>ధ గా రి - స ని ధ ని<br>శో . గి . . స . | ధ ని స ని - సా ధ ప<br>టే . . . శ సు తు<br>, ధ ప మ - గ మ ధ ని<br>ర . . సు . . డ |
| ముక్తాయి స్వరం | స రి స ని - ధ ని సా - ని ధ ని ధ - ప మ గ మ<br>ధ ని ధ గ - రి రి మ గ - రి స ని ధ - ప ధ ని స | ప ధ ని ధ - ని స ని ధ<br>ని స రి ధ - ని స మ ధ | ని స ని రి - సా ;<br>ని గ రి ని - ధ మ ధ ని |
| చరణం | ధా , ని - రి స స ని - ధ ప మ గ - , రి స రి<br>దా ని మ . . . ట . లు వి . ని . | గా , మ - ; ప ధ<br>ఇం త సా . | ని సా ని - , ధ ప మ<br>హం స మే ల . ర |
| 1. | గా మా - గ రి ని రి - సా ధ ని - స రి ని రి | , రి రి గ - మ ధా ని | ధా మ గ -, మా ని ॥గాని॥ |
| 2. | ధా ని ధ - ప మ గ మ - ధ పా గ - , రి స ని | సా రి గ - మ ప స ని | గ మా ని - ధ మ గ మ ॥గాని॥ |
| 3. | ధ ని ధ మ - గ మ ని ధ - మ గ రి స - ధ మ గ రి<br>ధ ని స గ - ని ధ ని స - రి గ రి ని - ధ ని ధ మ | స గ రి ని - ధ ని రి ని<br>గ రి స గ - రి ని ధ మ | ధ ని స రి - గ మ ధ మ<br>గ రి స ని - స రి గ మ ॥దాని॥ |

| | । | ○ | ∩ |
|---|---|---|---|
| 4. | ప ధ ని స -, ని ధ - ని స నీ ధ - రి స ని ధ<br>ని ధ మ గ - రి స ధ మ - గ రి స రి - గ మ ధ ని | పా మ గ -, మ ని ధ<br>రి సా ని - ధ ప స ని | మ ధ ని స - గా ;<br>, ధపమ - గామని ॥దాని॥ |
| 5. | సా, ని - ధ ని సా -, ని సా -, ని ధ ప<br>రి ని ధ మ - గ రి ని ధ - మ గ రి ని - ధ మ గ రి | ధ ని ధా - ; ప ధ<br>ని ధ ని స - రి గ మ ధ | ని ధ ప గ -, మ ధ ని<br>స రి గ మ - ధ మ ధ ని |
| | స రి గ రి -, ని ధ ని - గ రీ ని - ధ ని ధ ధ<br>గ మ గ రి - ని ధ ని గ - రి ని ధ మ - గ మ గ రి | , మ గ మ - ని ధా మ<br>స సా స - సా ని ధ | గ మ ధ మ - ధ ని స గ<br>మగరిని - సరిగమ ॥దాని॥ |



# (2) దర్బారురాగము

త్రిపుట తాళము – చతురశ్రజాతి (ఆది)

చిత్రతరమార్గము – సమగ్రహము

ఆరోహణము : స రి మ ప ధ ని సీ

అవరోహణము : సీ నీ ధ ప మ రి గా రి స

పల్లవి :– చలమేల జేసేవుగా చాలనమ్మిన నాపై

అనుపల్లవి :– వలచియున్న నాతో వాదేల వేణుగోపాలదేవ

చరణము :– పలుకుము నాతో

| | I | O | O |
|---|---|---|---|
| పల్లవి | ప మ రీ - గా గ్గా - రి స రీ - ని రి స ని | ధ ప ధ ని - స రి స రి | పా మ గ - , రి స రి |
| | చ . ల మే . ల . . జే . . . | . . సే . . . . . | వు . రా . . . |
| | ప మ రి గ - రి స రి మ - ప మా ప - | ధ ని సీ రి నీ , ధ - , ప ధ ని | ప మ గ గ - , రి స రి |
| | చా . . . . . ల . . న . . . | . . మ్మి నా న . . | . . . . పై . . |

| | । | ౦ | ౦ |
|---|---|---|---|
| అను | ధ ని ప ధ - మ ప రి మ - రి ప మ రి - గ గ రి స | మ మ రి ప - ప మ ధ ధ | ప మ ప ధ - ని ని సా |
| పల్లవి | వ . . . . . ల . . . . . చి . . . | యు . . . . . . | . న్న నా . . . తో |
| | ప ధ ప సే - ని సే రి సే - రి గా రి - సే ని సే రి | సా , ప - ; ధ ని | ప మ గ గ - , రి స రి |
| | వా . . డే . . ల . . వే . . ఋ . . | గో పా ల . | . . డే . వ . . |
| ముక్తాయి | ప మ రి గ - రి స ని రి - స రి ని స - ధ ప ధ ని | స రి స మ - రి ప మ ధ | ప ధ మ ప . ధ ని సా |
| | ధ ప ధ ని - సే రి సే రి - గా , రి - సే రి నీ | ధ ప సే సే - , ప పా | ధ ప మ రి - గ రి స రి‖ |
| స్వరం చరణం | పా పా - ; ధ ప - మ ప ధ ప - ధా ధ రి | నీ నీ - , ధా ప | గా గా - రి స రి మ |
| | ప లు క . . . . . . ము . | . . . . | వా . తో . . . |
| 1. | పా ; - ; ధా - ; పా - మా రీ | గా , రి - ; సా | ; రీ - ; మా ‖పలుక‖ |
| 2. | పా ధ ధ - ప మ పా - ప మ రి గ - , రి స రి | ని రి స ని - , స ధా | , స్రీ స - , రీ మ ‖పలుక‖ |
| 3. | ధ ప ధ మ - ప రి మ ప - స రి మ ప - మ రి గ రి | స రి ని స - ధ ని ప ధ | ప ధ ని స - రి మ ప ధ |
| | స రి మ ప - ధ మ ప ధ - ని సే ప ధ - ని సే రి ని | గా రి సే రి - ని రి సే ని | సేధపధ - మపరిమ ‖పలుక‖ |
| 4. | ధ ని సే ప - , ప ధ ప - మ రి గా - రి స రి ని | సా , ధ - ధ ప ధ ని | స స్రీ స - రీ మ ప |
| | ధా ని సే - రి సే నీ - , ధ ధ ప - మ ధ ప మ | గా , గ - రి స ని స | రి మ ప మ - పా ; |
| | ధ ప మ రి - గ రి సా - రి మ ప రి , మ ప ధ | మా ప ధ - ని సే పా | ధ ని సే రి - సీ సే రి |
| | గా గా - రి సే నీ - నీ ధ ప - ధ ని సే రి | నీ సే ప - , ధ మా | పరీప - సారిమ ‖పలుకుము‖ |

—★—

## (3) కాంభోజిరాగము

త్రిపుటతాళము – చతురశ్రజాతి (ఆది)

చిత్రతరమార్గము – సమగ్రహము

ఆరోహణము : స రి గ మ ప ధ సి

అవరోహణము : సి ని ధ ప మ గ రి స

పల్లవి :– తరుణి నిన్నుబాసి తాళలేదుర

అనుపల్లవి :– ధరలో వెలసిన శ్రీత్యాగేశ జగదీశ

చరణము :– సరసకురారార

| | I | O | O |
|---|---|---|---|
| పల్లవి | షా ధా - సా రి ని - ధ ప ధ స - రి గ మ మ | గ గ రి రి - , స మ గ | రి గ స రి - నీ ధ ప |
| | త రు ణి . . . . ని . . . . . | న్ను . . . . బా . | . . . . సి . . |
| | ధ స రి ప - మ గ స రి - గ మ ప ధ - మ గ ప ధ | రి సా ని - ధ ప ధ ప | , మ గ రి - రి సా ని * |
| | తా . . . . . ళ . . . . . లే . . . | . . . . . . దు | . . . . . ర . |

| | I | O | O |
|---|---|---|---|
| చ. | సా ; - ; సీ ని - ధ ప మ గ - రి స రి గ | సా ; - ; సీ ని | ధ ప ధ మ - గ పా ధ |
| | రి గ మ ప - , మ గ మ - ప ధా గ - మ ప ధ ని | , ప ధ ని - ని ధ మ ప | ని ధ ప ధ - పా , ధ |
| | ప మ గ మ - , ప మ ప - ధ ధా ప - స ని ని ధ | ప ధ సీ గ - ప ధ సీ ం | గ మ ప ధ - సా ని ధ |
| | పి రీ సీ - ని ధ రి సీ - ని ధ గీ రీ - , స ని ధ | ప ధ స రి - గాం గ ప | ధ స రి రి - గ మ ప ధ ॥సా॥ |

* ఈ గుర్తు అన్యస్వరము



# (4) మోహనరాగము

## త్రిపుటతాళము – చతఃరశ్రజాతి (ఆది)

చిత్రతరమార్గము – సమగ్రహము

ఆరోహణము : స రి గ ప ధ సీ

అవరోహణము : సీ ధ ప గ రి స

పల్లవి :– నిన్నుకోరియున్నానుర నిఖిలలోకనాయక

అనుపల్లవి :– నన్నుపాలింప సమయమిదే నామీదకృపజూడర

చరణము :– సన్నుతాంగ శ్రీనివాస

| | I | O | O |
|---|---|---|---|
| పల్లవి | గా గా – రీ ; – స స రి రి – గ గ రి రి | స రి గ రి – స రి స ధ | స రి గ ప – గ రి స రి |
| | ని న్ను కో రి . . . యు . . . | న్నా . . . ను . . . | ర . . . . . . . |
| | గ ప గ గ – రి స రి గ – రి రి స ధ – స రి గ రి | గ ప గ ప – ధ ప ధ సీ | గా ప గ – ధ ప గ రి |
| | ని . . . . . ఖి . . . . . ల . . . | లో . . క . . నా . | . . య . . క . |

| | I | O | O |
| --- | --- | --- | --- |
| అను పల్లవి | సా ధ ధ - ప మ ధ ప - , మ గ ప - గా మ రి | గ మ ప ధ - ధ ప మ ప | ధ ని స ని - సా రి గ |
| | తా . . . . . మ స . . . . . | ము . . సే . . . . | య . . . క . . |
| | మ గ రి స - స రి స ని - ధ ప ధ ని - స రి సా | స ధ ప ప - , మ గ రి | స మ గ మ - పా ధ ని |
| | ద . . . య . జా . . డ . . . ర | . . . . గో . . | పా . . . ల . . |
| ముక్తాయి స్వరం | స రి ని స - ధ ని స ప - ధ ని స ధ - ప మ ప ధ | మ ప గ మ - ప రి గ మ | స రి గ మ - ప ధ ని స |
| | రి గ మ గ - రి గ రి స - ని ప ధ ని - సా పా | స ని ధ ప - , మ గ రి | స రీ గ - మ ప ధ ని |
| చరణం | పా ధ ని - స స ని ధ - ప మ గ రి - గా మా | పా మ ధ - , ప స ని | ధ ప మ గ - మ రి గ మ |
| | నీ . . . ర . . జా . . . . . | క్షీ . నీ . పై . | . . . . . ని . . |
| 1. | పా , మ - ; పా - , గా మ - , రీ గ | సా , రి - ; నీ | , సా రి - , గా మ ‖సా‖ |
| 2. | ప ధా ప - మ గ మ ప - , మ గ మ - రి గా రి | స ని ధ ని - ప ధ ని స | రీ ని స - , రి గ మ ‖సా‖ |
| 3. | మా ధ ప - మ గ మా - ప గ మ రి - గ సా ని | స మ గ రి - స ని ధ ని | స రి గ మ - పా గ మ |
| | ప ధ ని ప - ధ ని స రి - స గ రీ - స ని ధ ని | సా రి ని - ధ పా ధ | మ గ రి స - రి గా మ ‖నీ‖ |
| 4. | పా మ ప - గ మ రి గ - సా మ గ - రి స ని ప | ధా ని స - రి స నీ | స రి గ మ - పా ధ ప |
| | సా ని రి - , స మ గ - రి గ సా - ని ప ధ ని | సా సా - ని ధ పా | మ గ రి స - , రి గ మ ‖నీ‖ |

—★—

| | I | O | O |
|---|---|---|---|
| అనుపల్లవి | పా ధ ధ - ప మ ధ ప - మ ప మ గ - గ మ ప మ | ధా , ప - ధ ని స ని | ప ధా ప - మ పా మ |
| | చ్రా . . . . అ . . . . నే . . . . | వే . . . . . | . డి . . న శ్రీ |
| | మ గ మ ప - మ ధా ప . స ని రి స - ని ప ధ ని* | స ని ప ధ - ; ప మ | ధ ప మ గ - మ ప ధ ని* |
| | . . . . . వే . ణు . . . . గో . . | పా . . లం . . | ని . . తే . . . వే |
| ముక్తాయి స్వరం | సా , స - ని ప ధ ని* - స స ని ప - ధా ప మ | ధ ప మ ధ - ప మ గా | మ ప మ ధా - మ ధ ని* |
| | స ని ప ధ - ని స ని ప - ధ ప మ ధ - ప మ గ గ | మ గ మ ప - మ ప ధా | ప మ ప ధ - , ప ధ స* |
| చరణం | సా ; - ; ధ ని* - స స ని ప - ధా ప మ | పా ; - ; ధ ప | మ ప మ గ మ ప ధ ని* |
| | నీ ప . ద . . . ము . . | లే న . | మ్మి . . . తి . . ని |
| 1. | సా , ని - ; ధా - ; పా - మా పా | మా , గ - ; మా | ; పా - , ధా ని* ॥నీ॥ |
| 2. | సా , స - ని రి స ని - ధా , ప - మ ధ ప మ | గా , మ - గ మ ప మ | ధా , ప - మ ప ధ ని* ॥నీ॥ |
| 3. | స స ని ని - స స ని ప - ధ ధ ప ప - మ ధ ప మ | గ గ మ గ - మ ప మ ప | ధధపప - మపధని* |
| | ప ప మ ధ - ధ ప స ని - రి రి స స - ని ని ప ధ | ని* స స ని - ని ప ధ ధ | పపమగ - మపధ ని* ॥నీ॥ |

| | । | ౦ | ౦ |
|---|---|---|---|
| 4. | సా ; - ; సని - రిసనిస - నిరిసని | ధా ; - ; పమ | ధపమధ - పమపమ |
| | గా ; - ; మగ - మపమధ - ధపధని* | ససనిరి - రిససని | ధధపప - మపధని |
| | ససాస - నిరిసని - పధాధ - పమధప | ఋపాప - మగగఋ | పమగమ - పమ ధా |
| | పపమధ - , పసస - నిరిసస - నిరిసని | సనిపధ - పమపమ | గఋధప - సనిరిని ॥సా॥ |

* ఈగుర్తు అన్యస్వరము

పర్ణములను మూడుకాలములలోను అభ్యసించవలెను.



శ్రీ నారాయణతీర్థ గ్రంథమాల

# సంగీత శాస్త్ర వాచకములు

## గానవిషయము

(లక్ష్య లక్షణములు)

## రెండవ వాచకము

గ్రంథకర్త:

పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రథమ ముద్రణము–1000 ప్రతులు

శాలివాహన శకము ౧౮౭౭

మన్మథ సంవత్సరము

క్రీ. శ. 1955



మూల్యము

రు. 2—8—0

7. వ ప్రకరణమున 71. పేజీలో త్యాగరాజు ఆరువేల న్నియోగి బ్రాహ్మణుడని చెప్పబడియున్నది. కంభం, మార్కాపురం ప్రాంతములందు మురికినాటి వారిలో కాకర్లవారు గలరేమోనని తెలిసికొన ప్రయత్నించితిని. కాని ఏ సమాచారము అందలేదు. ఆ ప్రాంతమున ఉన్నయెడల త్యాగరాజు మురికినాటి బ్రాహ్మణుడనియే అనుకొనవలసి యున్నది. తిరువయ్యారు ప్రాంతమున ఒకవేళ కాకర్లవారు మురికినాటి వారుండినను కోనసీమ ద్రావిడులవలె వారికది దేశనామమై యుండవచ్చునని తలంచి పై విధముగ వ్రాయుట జరిగినది. కాని ఎట్లైనను ఆభ్యంతరముండదు.

ఈ నా సంగీత శాస్త్ర పరిశోధనకు అయిదు సంవత్సరముల పై కాలమునుండి తోడ్పడుచున్న హైదరాబాదు ప్రభుత్వమువారికి నేనెంతయు కృతజ్ఞుడను.

అచ్చువేయించుకొనలేని పరిస్థితులలో తమస్వంత పెట్టుబడితో ముందుగా అచ్చువేసి యిచ్చుట మూలమున చేసిన మహోపకారమునకు శికిందరాబాదు వాస్తవ్యులు దివ్యవాణి పత్రికాసంపాదకులు, గర్గభాగవతము మున్నగు నుత్తమగ్రంథముల రచించిన వారునగు 'మహాకవి' శ్రీ చిపురుల అప్పయ్యశాస్త్రిగారికి ఎంతయుకృతజ్ఞుడను

24—5—55
విద్యానగరము

ఇట్లు
పుచ్చావేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

# విషయ సూచిక




| | పుట | | పుట |
|---|---|---|---|
| దైవప్రార్థన. | | | |
| 1. పరిభాషాపదములు. | | | |
| (1) నాదము | 2 | (10) విషమము | ,, |
| (2) గాంధర్వము | 3 | (11) కాలము | 6 |
| (3) భరతము | ,, | (12) మార్గము | ,, |
| (4) తౌర్యత్రికము | 4 | (13) క్రియ | ,, |
| (5) సంగీతము | ,, | (14) అంగము | ,, |
| (6) గ్రహము | ,, | (15) జాతి | 7 |
| (7) సమగ్రహము | 5 | (16) ద్రుతలయ | ,, |
| (8) అతీతము | ,, | (17) మధ్యలయ | ,, |
| (9) అనాగతము | ,, | (18) విలంబితలయ | ,, |



| | | | |
|---|---|---|---|
| 2. గమకములు:— | 8 | | |
| (1) తిరిపము | 9 | (8) కురుళము | 15 |
| (2) i స్ఫురితము | 10 | i ఒదిగింపు | 16 |
| ii ప్రత్యాఘాతము | 12 | ii ఒరయిక | ,, |
| (3) కంపితము | 13 | (9) ఆహతము | 17 |
| (4) లీనము | ,, | i రవ | ,, |
| (5) ఆందోళితము | 14 | ii ఖండింపు | 18 |
| (6) వళి | ,, | (10) ఉల్లసితము | ,, |
| (7) త్రిభిన్నము | 15 | ఎక్కుజారు | 19 |

| | పుట |
|---|---|
| (2) మార్గము | 36 |
| 1. అతిచిత్రతమ మార్గము | 37 |
| 2. చిత్రతమమార్గము | ,, |
| 3. చిత్రతరమార్గము | 38 |
| 4. చిత్రమార్గము | ,, |
| 5. వార్తికమార్గము | 39 |
| 6. దక్షిణమార్గము | 40 |
| 7. త్రిశ్రమార్గము | ,, |
| 8. మిశ్రమార్గము | 41 |
| 9. ఖండమార్గము | ,, |
| 10. సంకీర్ణమార్గము | 41 |
| (3) క్రియ | 43 |
| (4) చాపుతాళములు | ,, |
| 1. చతురశ్ర చాపు తాళము | 44 |
| 2. త్రిశ్ర చాపుతాళము | 45 |
| 3. మిశ్ర చాపుతాళము | ,, |
| 4. ఖండచాపుతాళము | 46 |
| 5. సంకీర్ణ చాపుతాళము | ,, |
| (5) దేశాది తాళము | 47 |
| 5. రాగలక్షణములు :— | 47 |
| (1) సావేరి రాగలక్షణము | 48 |
| (2) చక్రవాక ,, | 49 |
| (3) ఆనందభైరవి ,, | 50 |
| (4) రీతిగౌళ ,, | 51 |
| (5) ఖరహరప్రియ ,, | 52 |
| (6) కేదారగౌళ ,, | 53 |
| (7) హరికాంభోజి ,, | 54 |
| (8) హంసధ్వని ,, | 55 |
| (9) బిలహరి ,, | 56 |
| (10) జగన్మోహిని ,, | 57 |
| (11) పూరికల్యాణి ,, | 58 |
| (12) షణ్ముఖప్రియ ,, | 59 |
| (13) కానడ ,, | 60 |
| (14) చారుకేశి ,, | 61 |
| (15) జంఝూటి ,, | 62 |
| 6. సంగీత రచనలు :— | 64 |
| (1) సంచారి గీతము | ,, |
| (2) తానవర్ణము | ,, |
| (3) పదము | 65 |
| (4) పదవర్ణము | 66 |
| (5) కృతి లేక కీర్తన | 67 |

13. ఇతరుల కృతులు.


(1) నీలకంఠంభజేహం 173
(2) వాతాపి గణపతిం 178
(3) హిమాచలతనయ 185
(4) జననీ నినువినా 189
(5) కృపయాపాలయ 197
(6) నినువినాగతి 203
(7) మత్స్యఃకూర్మవరాహ 208
(8) రామకృష్ణ గోవిందేతి 211
(9) ఏమయ్యారామ 213
(10) పరమపావనరామ 218
(11) పరిదానమిచ్చితే 222
(12) మరివేరె 231
(13) శ్యామలగాత్రి 235

14. కీర్తనలందలి కొన్ని విశేషములు.............. 240




ఓం

# సంగీత శాస్త్ర వాచకములు

## గాన విషయము

## (లక్ష్య లక్షణములు)



## రెండవ వాచకము

శ్లో॥ శుక్లాం బ్రహ్మ విచార సార పరమా మాద్యాం జగద్వ్యాపినీం
వీణా పుస్తక ధారిణీ మభయదాం జాడ్యాంధకారాపహాం
హస్తే స్ఫాటిక మాలికాం విదధతీం పద్మాసనే సంస్థితాం
వందే తాం పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదాం॥

తా॥ తెల్లని స్వరూపము గలదియు కేవల బ్రహ్మాను సంధాన పరాయణయు, నాదియు, జగత్తులయందు వ్యాపించి యుండునదియు, వీణా పుస్తక ధారిణియు నభయప్రదయు, నజ్ఞానాంధకార నాశనియు, హస్తమునందు స్ఫటికమాలను ధరించినదియు, పద్మాసనమందు కూర్చున్నదియు, బుద్ధిబలము నొసంగు నట్టిదియు షడ్గుణైశ్వర్యసంపన్నయు, పరమేశ్వరియు, నగు నా శారదాంబకు నమస్కరించుచున్నాను.

# 1. పరిభాషా పదములు

1. నాదము, 2. గాంధర్వము, 3. భరతము, 4. తౌర్య త్రికము, 5. సంగీతము, 6. గ్రహము, 7. సమగ్రహము, 8. అతీతగ్రహము, 9, అనాగతగ్రహము, 10. విషమగ్రహము, 11. మార్గము, 12. క్రియ, 13. అంగము, 14. జాతి, 15. ద్రుతలయ, 16. మధ్యలయ, 17. విళంబలయ, 18. చౌకము అనునవి పరిభాషాపదములు.

## వివరములు

### 1. నాదము :-

ప్రాణమునకును, అగ్నికిని సంయోగము కలుగునపుడు పుట్టునట్టి ధ్వనికి నాదమని పేరు. పుట్టుక యీ విధముగా నేర్పడు చున్నందున "న" అను ప్రాణబీజమును, "ద" అను అగ్నిబీజమును చేర్చి దీనికి నాదమను వ్యవహారమును శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. ఇచ్చట ప్రకరణము ననుసరించి చెవికి వినుపించునట్టిన్ని, ఉచ్చరించుటకు అనుకూల మగునట్టిన్ని, మంద్ర, మధ్య, తారములను త్రిస్థాయిలతో కూడిన అఖండమైన ధ్వని విశేషమునకు నాదమని పేరు.

నాదము నుండి స్థాయిలును, స్థాయిలనుండి శ్రుతులును, శ్రుతులనుండి స్వరములును, స్వరములవలన రాగములును ఏర్పడుచున్నవి. అటులనే నాదమునుండి వర్ణము (అక్ష

రము)ను: వర్ణము (అక్షరము)ల వలన పదమును, పదముల వలన వాక్యమును, వాక్యములవలన లోకవ్యవహారమును ఏర్పడుచున్నది.

## 2. గాంధర్వము :-

గాంధర్వము సామవేదమునకు ఉపవేదము. సంగీత విద్య గంధర్వులకు ప్రీతిదాయకమైనది గాన గాంధర్వ మన బడినది. గంధర్వులనువారు దేవగాయనులు. వారు నారదాదులు.

మరియు ఏది తంత్రు (తీగ)ల యందుండునదియును, అనేక విధములైన తత-అవనద్ధ-సుషిర-ఘనములను నాలుగు విధములైన వాద్యములకు ఆశ్రయ మైనదియును, స్వర తాల పదములకు స్థానమైనదియు నై యుండునో అదియే గాంధర్వ మని కూడ చెప్పబడినది.

ఋషిప్రోక్తమైన గీత వాద నృత్యములకు గాంధర్వ మని మరొక సిద్ధాంతము.

## 3. భరతము :-

గాంధర్వము భరతముని వలన భూలోకమునందు ప్రవర్తింపజేయబడినందున భరత మనబడినది. మరియు గాంధర్వమునందు భావము, రాగము, తాళము అనునవి ముఖ్యము లగుటచేత ఈ పదముల యొక్క మొదటి అక్షరము లగు భ-ర-త అనునవి చేరి భరత మనబడినదని కొందరు

చెప్పిరి. నృత్యమువలన భావమును, వాద్యమువలన తాళమును వ్యక్తము లగుచున్నవి గాన గీత - వాద్య - నృత్యములు మూడును భరతి శబ్దమునం దిమిడియున్నటుల స్పష్టమైనది.

4. తౌర్యత్రికము :-

నృత్తము, గీతము, వాద్యము అను మూడింటితో కూడిన నాట్యమునకు తౌర్యత్రిక మనిపేరు. తూర్యము లనగా మద్దెల మొదలగు వాద్యములు. ఇట్టి వాద్యముతో సహా మూడు అవయవములు (వాద్య, గీత, నృత్యములు) గలది గాన తౌర్యత్రికమని చెప్పబడినది.

5. సంగీతము :-

గీత, వాద్య, నృత్యముల చేరికకు సంగీతమని పేరు. గీత, వాద్యముల రెంటి చేరికకే సంగీతమను పేరును కొందరు నిర్ణయించిరి. వస్త్రపు ముక్కను గూడ వస్త్రమని వ్యవహరించినటుల గీత, వాద్య, నృత్యములలో నృత్య భాగము కొరత పడినను గీత వాద్యములను సంగీతమని వ్యవహరించ వచ్చునని కొందరనిరి.

6. గ్రహము :-

గ్రహించుటకు గ్రహమని పేరు. తాళమందు గీతము గ్రహింపబడుచున్నది. అనగా ప్రారంభింపబడుచున్నది. అట్టి ప్రారంభ స్థానమునకు గ్రహస్థానమని పేరు. గ్రహమనగా యిచ్చట గ్రహస్థానమని తాత్పర్యము.

7. స మ గ్ర హ ము :-

తాళ, గీతముల రెంటిని ఒక పర్యాయమే సమముగా ప్రారంభించుటకు సమగ్రహమని పేరు.

8. అ తీ త ము :-

అతీత మనగా అతీతగ్రహము. గీతమును ప్రారంభించిన పిమ్మట తాళమును ప్రారంభించుటకు అతీతగ్రహమని పేరు.

9. అ నా గ త ము :-

అనగా అనాగత గ్రహము. తాళమును ప్రారంభించిన పిమ్మట గీతమును ప్రారంభించుట అనాగతగ్రహము.

10. వి ష మ :-

అనగా విషమగ్రహము. తాళావర్తమునందలి రెండవ హస్తక్రియ యొక్క ప్రారంభమందును, తుదిక్రియ యొక్క ప్రారంభమునను, తాళముయొక్క ఆద్యంతములందు గల ఈ రెండు హస్తక్రియలకును మధ్యనుండు ఏ హస్తక్రియ ప్రారంభమందైనను లేక ఏ రెండు హస్తక్రియల మధ్యనుండు అంతరము లేక విశ్రాంతి యందైనను గీతమును ప్రారంభించుటకు విషమగ్రహమని చెప్పబడినది. అనగా సమ, అతీత, అనాగత గ్రహములకు చెప్పబడినస్థానములుగాక తాళావర్తము నందు మరి ఏ స్థానమందైనను గీతమును ప్రారంభించుట విషమగ్రహమని తాత్పర్యము.

# 2. గమకములు

వినువారి చిత్తమునకు సుఖముగా నుండు నటుల స్వరమును కంపింపజేయుటకు గమకమని చెప్పబడినది. గీతమునందు స్వరము స్వకీయమైన శ్రుతియందుండి ఛాయామాత్రముగ అన్య శ్రుతిని ఆశ్రయించుట కొరకు జరుగబడునట్టి స్వరగమనము (కంపనము) గమకమని కొందరనిరి. అట్టి గమకములు.

| పేర్లు | సంజ్ఞలు |
|---|---|
| 1. తిరిపము | W |
| 2. స్ఫురితము (1) | ∵ |
| ప్రత్యాఘాతలు (2) | ∴ |
| 3. కంపితము | ∿∿ |
| 4. లీనము | ∿— |
| 5. ఆందోళితము | ∿∿∿— |
| 6. వళి | ∩ |
| 7. త్రిభిన్నము | M |
| 8. కురుళము=(1) ఒదిగింపు | X |
| (2) ఒరయిక | ⌤ |
| 9. ఆహతము (1) రవ. | ∧ |
| (2) ఖండింపు | √ |
| 10. ఉల్లాసితము (1) ఎక్కుజారు | / |
| (2) దిగుజారు | \ |

11. ప్లావితము ꩜
12. గుంఫితము ▱
13. ముద్రితము O
14. నామితము —
15. మిశ్రితము *

అని 15 విధములుగా చెప్పబడినవి.

# వివరములు

## 1. తిరిపము

(i) ఈ గమకమునకు చిహ్నము W

(ii) వినియోగము :—

కంపము ననుసరించిన అత్యల్పమైన సుందరమగు డమరు ధ్వనిని పలికించుటకు తిరిపమని పేరు.

ఇది ద్రుత తుర్యాంశ వేగోపలక్షితము. అనగా ద్రుత కాలము యొక్క నాలుగవవంతు వేగము గలదియని అర్థము.

ద్రుతకాల మనగా రెండు హ్రస్వాక్షరముల కాలము. ఇది ఒక సెకండు కాలమునకు సమానము. ఈ సెకండు కాలములో నాలుగవ వంతు కాలము పావు సెకండు కాలము. ఇది చతుర్భాగకాలము గనుక చతుర్భాగకాలము వేగమున ఈ గమకమును అనుష్ఠించవలెను.

ఉదాహరణము :

——వీణయందు పంచమమును పలికించి ఆ పంచమమును అదిమి ధైవత స్వరఛాయను రప్పించి తిరిగి పంచమమందు నలుచుట. అనగా పంచమస్వరమందు మీటి కొంచెము తడవుతో ధైవతమునకు వెళ్లి తిరిగి పంచమములోనికి మీటుతో చేరవలెను. అప్పుడు "పధాప" అని వచ్చును. ఇదేవిధముగ మిగతా స్వరములకు కూడ తెలియవలెను.

ఇందు ఒక స్వరమున ఒక అక్షరకాలము నిలిచి దానిని అదిమి దానికి ఆరోహణ క్రమమున దగ్గరగానుండు స్వరము యొక్క ఛాయను రప్పించుటకు తిరిపమని కొందరు చెప్పిరి. దీనికి "నొక్కు" అను వ్యవహారము కూడ గలదు.

డం. అనుశబ్దమును పలుకునట్టి వాద్యమునకు "డమరు" అని పేరు. తిరిపము అను పదమునకు భిక్షము అని అర్థము. ఇచ్చట భిక్షమునకు సంబంధించినది అన్యస్వరఛాయ.

## 2. స్ఫురితము

ద్రుత తృతీయాంశ వేగము గలది స్ఫురితము. అనగా ద్రుతమందు మూడవ భాగమైన వేగము గలది యని తాత్పర్యము.

ద్రుతమందు మూడవ యంశమన సెకండు కాలములో మూడవ వంతు. దీనిని విభజించుటగాని, గ్రహించుట గాని కష్టసాధ్యమైనపని. అందువలన చతుర్భాగకాలమున ద్రుత

కాలములో నాలుగవవంతు కాలమున) కంటెను కొంచెము విళంబముగను ద్రుతార్ధ కాలమున (అనుద్రుత కాలమున లేక అక్షర కాలమున) కంటెను కొంచెము వేగముగను అనుష్ఠించుట కొరకు గాను పై విధమున మూడవవంతు ద్రుతకాలమని చెప్పబడినది. ఈ గమకము స్ఫురితమని ప్రత్యాఘాతమని రెండు విధములు.

### 1 స్ఫురితము

(i) దీనికి చిహ్నము ∵

(ii) వినియోగము.

ఆరోహణ క్రమమున గల సస, రిరి మొదలయిన జంట స్వరములలో మొదటి దానిని అనుష్ఠించిన పిమ్మట రెండవ దాని కొరకు ముందుగా యీ స్వరమునకు అవరోహణమందు సమీపమున గల స్వరమందు ముప్పాతిక అక్షరకాలము కొట్టుతో నిలచి వెంటనే దానికి ఆరోహణమందు గల పై స్వరమునకు వచ్చుట, అనగా జంట స్వరములలోని మొదటి స్వరమును కొట్టి అందుండి రెండవస్వరమును ప్రారంభించి పలికించుట యని తాత్పర్యము.

ఉదాహరణము :

వీణలో సస అని పై షడ్జమును జంటస్వరముగా పలికించుట కొరకు మొదటి 'స'ను షడ్జముయొక్క మెట్టుమీదనే

వేలిని అదిమి పలికించవలెను. రెండవ 'స'ను పలికించుటకు గాను అవరోహణమందు సమీపమున గల నిషాదస్థానమందు వేలిని ఉంచి మీటి మునుపటికాలము అటులనే ఉంచి వెంటనే నిషాదము యొక్క మెట్టుమీద ఉంచిన వ్రేలిని తీగను రాచుకొనుచు షడ్జస్థానమునకు తీసుకొనిరావలెను. ఈవిధముగ సస అని జంటను పలికించుట స్ఫురితము.

## 2. ప్రత్యాఘాతము

(i) చిహ్నము .˙.

(ii) వినియోగము.

స్ఫురితము అనునది ఆరోహణమందు చెప్పబడినదానికి పేరు. అదేమాదిరి అవరోహణమందు అనుష్ఠించుటయే ప్రత్యాఘాతము.

ఉదాహరణము :

సస అను జంట స్వరములలో మొదటిదానిని అనుష్ఠించి పిమ్మట ఆరోహణక్రమమందు గల "రి" స్వరమును కొట్టి తిరిగి అవరోహణక్రమమున గల "స" స్వరమునకు వచ్చుట. అప్పుడు "సరిస" అని వచ్చును. ఈ గమకమునకు డోలము అను పేరుకూడ కలదు. డోలమన కదలింపు. అది ముత్యపుచిప్పలో నీరు పొరలినట్లు ఉండవలయునని చెప్పబడినది.

## 3 కంపితము

ద్రుతార్థమాన వేగోపేక్షితము కంపితము :—అనగా ద్రుత కాలము యొక్క సగము వేగము గలది కంపితము.

ద్రుతార్థమానము అనగా అనుద్రుత కాలము. అనుద్రుతకాలమనగా ఒక అక్షర కాలము. ఇది అర సెకండు కాలమునకు సమానము.

(i) దీనికి చిహ్నము ∼

(ii) వినియోగము.

స్వరమును ఒక అక్షర కాలము వరకు ముందు వెనుకలకు (వీణలో తీగను) కదలించుట లేక ఒణికించుట కంపితము. ఈ సందర్భమున అన్యస్వరఛాయను రప్పించకూడదు.

## 4 లీనము

ద్రుతవేగముచేత కంపముగలది లీనమగుచున్నది. ద్రుతవేగమన రెండుఅక్షరముల కాలము లేక సెకండుకాలము. ఈ ప్రమాణములో అనుష్ఠించుట లీనమనబడినది.

i దీనికి చిహ్నము ∼_

ii వినియోగము.

ఒక స్వరమందే రెండక్షరముల కాలము వరకు కదలించుచు అనగా కంపింపజేయుచు నిలిచి ఆరోహణమందు దానికి సమీపమునగల స్వరఛాయను రప్పించి లయింప జేయుట లీనము. కంపింపజేయుట, లయింపజేయుట ఈ రెండును ద్రుతకాలమునకు సరిపోవలయును.

## 5. ఆందోళితము

లఘువేగము గల లయచేత దురితముగా గాని మధ్యముగా గాని, విలంబితముగా గాని స్వరమును కంపనము జేయుట ఆందోళితమను గమకమని చెప్పబడినది. ఈ గమకమునందు దురితముగా కంపింప జేసినను, దీనికి రెట్టింపు నిదానముగలదగు మధ్యలయతో కంపింపజేసినను లేక ఈ మధ్యలయకు రెట్టింపు నిదానము గల విళంబితలయతో కంపింపజేసినను లఘుకాలము వరకే చేయవలయును.

(i) దీనికి చిహ్నము ~~~—

(ii) వినియోగము.

ఒక స్వరమందే నాలుగు అక్షరముల కాలము (రెండు శెకండ్ల కాలము) వరకు కదలించి (కంపింపజేసి) ఆరోహణమందు దానికి సమీపమునగల స్వరముయొక్క ఛాయను రప్పించుట. ఆందోళితము అనగా ఊగడము.

## 6. వళి

అనేక విధములగు వక్రిముల (వంకరల) తో కూడి, వేగముగా చేయబడిన స్వరకంపనమునకు వళియని చెప్పబడినది.

(i) దీనికి చిహ్నము ∩

(ii! వినియోగము.

ఒక స్వరమును సుడియించి పట్టి దానికి (ఆరోహణమందలి) మీది స్వరము యొక్క ఛాయను రప్పించుటకు వళియని పేరు.

## 7. త్రిభిన్నము.

మూడు స్థానములందును హెచ్చుస్వరములచేత దట్టముగా ఎడతెగక (అవిశ్రాంతిగా) వ్యాపించునది త్రిభిన్నమని చెప్పబడినది.

(i) దీని చిహ్నము M

(ii) వినియోగము.

వీణయందు మంద్రపంచమ, సారణి తంత్రులయందు అడ్డముగా ఎడమచేతి వ్రేళ్లను పెట్టుకొని కుడిచేతితో మంద్రషడ్జ, మంద్రపంచమ, సారణి యను మూడు తంత్రులను జేర్చి మూడుస్థానములందును గల హెచ్చుస్వరములను దట్టముగా ఎడతెగక వ్యాపించుచు రంజకము కలుగునటుల వాయించుటకు త్రిభిన్నమని పేరు.

ఇది తానమును వాయించునపుడు చాల అనుకూలముగా నుండును.

## 8. కురుళము

గ్రంథియుక్తమై కంఠమందు పుట్టబడిన కోమలమగు వళియే కురుళమని చెప్పబడినది.

గ్రంధి యనగా ముడి స్వరమును సుడియించి పట్టుట వళియను గమకమునందు చెప్పబడినది. కురుళము అనగా ముంగురులు అందువలన ముంగురులు చుట్టుకొనిన విధమున

స్వరమును సుడియించి కోమలముగా పట్టవలయుననియును, గాత్రగానమునందు యిది కంఠస్థానమునందు ఉత్పన్నమగు ననియును చెప్పబడినది. ఈ గమకమును నేడు ఒదిగింపు, ఒరయిక అని రెండువిధములుగ వినియోగించుకొనుచున్నారు.

## 1. ఒ ది గిం పు

i దీనికి చిహ్నము X

ii వినియోగము.

ఇది నోటి పాటయందు జారుగమకమును బోలియుండును ఒక స్వరస్థానమునందుండి దానికి పైన (ఆరోహణమున) గల సమీపస్వరమును గాని, లేక దానికి తరువాతను గల స్వరమును గాని పలికించుట 'ఒదిగింపు' అని చెప్పబడినది.

ఉదాహరణము :

రిషభస్వరమునందు గాంధారమును గాని లేక దానికి తరువాతను గల మధ్యమస్వరమును గాని వీణలో పలికించుట

## 2. ఒ ర యి క

i దీనికి చిహ్నము ⌐

ii వినియోగము.

ఒక స్వరస్థానమునందుండి దానికి (అవరోహణమున గల) క్రింది స్వరములను దిగునపుడు ఒక్కొక్క స్వరమునకు

వెంబడి, సమీపమున గల మీది ( ఆరోహణమందలి ) స్వరము యొక్క ఛాయ కనుపించగా దానిని రాచుకొని దిగుట ఒరయిక యని చెప్పబడినది.

ఉ దా హ ర ణ ము :-

స̆ ని̆ ద̆ప = స రి. ని స. ధ ని. ప.

ముంగురులను నుదుటి మీదికి రాకుండునటుల ఏ విధముగా ప్రక్కకు ఒదిగించుకొనెదరో అదే విధమున స్వరములను ఒదిగించి పట్టుటకు ఒదిగింపు అని చెప్పబడెను. వీణా వాద్యమునందు దీని స్వరూపము బాగా వ్యక్తమగును.

9. ఆ హ త ము.

ముందున్నటువంటి హెచ్చు స్వరమును కొట్టి ఆ కొట్టుతో శీఘ్రముగా దిగువస్వరమును స్పృశించుటకు ఆహతమని పేరు. ఈ ఆహతము రవ, ఖండిపు అని రెండువిధములు.

1. ర వ

i దీనికి చిహ్నము ∧
ii వినియోగము.

ఏదైన నొక స్వరమునుండి రాల్చుకొని ఆ రాలెడు స్వరచ్ఛాయతో క్రింది (అవరోహణ) స్వరమునకు వచ్చుటకు రవ యని పేరు.

ఉదాహరణము

ప. స్వరమునుండి దిగువ షడ్జమునకు దిగునపుడు మధ్యను గల మ.గ.రి. అను స్వరములను రాచుకొని (లోపల అణగించుకొని) దిగుట. పైనుండి నాదము అవరోహణ క్రమమున దిగునపుడు తైలధారవలె అవిచ్ఛిన్నముగ క్రింది స్వరమునకు జారవలెను.

## 11. ప్లావితము

ప్లుతమానముచేత కంపనము ప్లావితము. ప్లుతమాన మనగా మూడు లఘువుల కాలము.

i చిహ్నము ీ

ii వినియోగము

ఒక స్వరమందే పదిరెండక్షరముల (మూడు లఘువుల) కాలము వరకు కదలించి ఆరోహణమందు దానికి సమీపమున గల స్వరచ్ఛాయను రప్పించుట ప్లావితము. ప్లావితమనగా తేలుట. ఆ విధముగ స్వరమును అనుష్ఠించవలయునని అర్థము. మరియు ప్లుతమునుండి ఏర్పడినది గాన ప్లావిత మనబడినది.

ఏ తాళాంగమునకైనను ప్రత్యేకముగ జాతిని నిర్ణయించి చెప్పనిచోట చతురశ్రజాతిగా గ్రహించవలయునని సంగీత మార్తాండము తాళాధ్యాయమున నిరూపించబడినది. ఇచ్చట ప్లుతమునకు జాతిని చెప్పకపోవుటచేత చతురశ్ర జాతి యని స్పష్టమైనది. చతురశ్రజాతి ప్లుతమునకు పదిరెండక్షర

ముల కాలము పరిమాణము. అందువలన ఈ గమకమునకు 12 అక్షరముల కాలము ప్రమాణముగా చెప్పబడినది.

12. గుంఫితము

మూలమున ఈ గమకము గుంఫితమని చెప్పబడినది. వ్యాఖ్యానమునందు సింహభూపాలుడు హుంఫితమని చెప్పెను.

హృదయస్థానమునుండి గంభీరముగ బయలుదేరిన హుంకారము గుంభితమని చెప్పబడినది.

i చిహ్నము ▱

ii వినియోగము

ఈ గమకము జారు గమకమును బోలి యుండును. స్వరనాదము బయలుదేరునది మొదలు నిలుచువరకు 'హుం' అని తైలధారవలె అవిచ్ఛిన్నముగ ఆరోహణక్రమమున నాదమును పెంచుకొని యేగుటయును, అటులనే అవరోహణ క్రమమున తగ్గుచూ దిగుటయును గుంఫితమని చెప్పబడినది.

13. ముద్రితము

ముఖమును (నోటిని) మూసికొని చేయబడిన స్వర కంపనము ముద్రితమని చెప్పబడినది.

i చిహ్నము O

ii వినియోగము

గానము చేయునపుడు నోటిని మూసుకొని స్వరమును కదలించవలెను. అనగా కంపింపజేయవలెను. ఈ గమకము గాత్రగానమునందు మాత్రమే వినియోగమగును.

## 14. నా మి త ము

స్వరములను నమనముగ కంపింప జేయుటకు నామిత మని చెప్పబడినది.

నమనము అనగా నమ్రము. అనగా సూక్ష్మము.

i చిహ్నము —
ii వినియోగము

స్వరావయవమైన శ్రుతినాదమును తగ్గించి సూక్ష్మ ధ్వనితో కంపింపజేయుచు గానము చేయుటకు నామితమని పేరు.

నాదమును తగ్గించుట యనిన మంద్రధ్వనిని అవరోహణ క్రమమున పలుకుట యని కొందరు అనవచ్చును. ఆ విధముగా నిర్ణయించిన గమకములయందు పునరుక్తి దోషము కలుగును. గాన ఏ స్వరనాదమునందు నామిత గమకమును అనుష్ఠించవలెనో ఆ స్వరనాదము నందలి పుష్టిని తగ్గించి సూక్ష్మావస్థలో ననుష్ఠించవలెను.

## 15. మి శ్రి త ము

పైన చెప్పబడిన గమకములు ఒకదానితో నొకటి మిశ్రమమగుట వలన మిశ్రితమని చెప్పబడినది. అందు పై గమకములకు సంబంధించిన వానిలో

1. తిరిపాందోళితము
2. లీనకంపితము
3. కంపితాహతము
4. తిరిపస్ఫురితము
5. లీనస్ఫురితము
6. స్ఫురితాహతము
7. లీనకంపితలీనము
8. త్రిభిన్న కురుళాహతము
9. ప్లావితోల్లాసితవళి
10. వళి గుంఫిత ముద్రితము
11. నామితాందోళితవళి
12. వళినామిత కంపితము
13. ఆందోళిత ప్లావితము
14. ఉల్లాసిత నామితము
15. తిరిపాందోళితవళి
16. త్రిభిన్న కురుళము
17. త్రిభిన్నలీనస్ఫురితము
18. ప్లావితాందోళితము

అనునవి ముఖ్యములు. లోగా వివరింపబడిన 14 విధములగు గమకములను చక్కగా అభ్యసించిన వారికి ఈ మిశ్ర గమకములు సులభసాధ్యము లగును.



# 3. రాగ విభాగములు

1. జనక రాగములు, 2. జన్య రాగములు, 3. వక్రి రాగములు, 4. భాషాంగ రాగములు, 5. మిశ్రరాగములు అని నేడు రాగములు అయిదు విధములుగ వ్యవహరింపబడు చున్నవి.

## వివరములు

### 1. జనకరాగములు

కొన్ని రాగముల పుట్టుకకు మూలమైన సంపూర్ణ రాగము జనకరాగమని చెప్పబడినది. దీనిని మేళకర్త రాగ మని కూడ యందురు. ఈ జనక రాగములకు ఆరోహణ మందునుఅవరోహణమందునుకూడ సప్తస్వరములుయుండును.

పూర్వమతమందు ఆరోహణమునగాని అవరోహణ మున గాని లేక ఆరోహణావరోహణముల మొత్తము మీాద గాని సప్తస్వరములు యుండినచో సంపూర్ణరాగములని చెప్ప బడినవి, అట్టివానిలో కొన్ని మేళకర్తలుగ కూడ చెప్పబడి నవి.

ఉదాహరణములు

నేటి జనక మేళములు స రి గ మ ప ధ ని సं

సं ని ధ ప మ గ రి స.

## పూర్వపుమతము

| | |
|---|---|
| 1. ఆరోహణమందు మాత్రమే సప్తస్వరములుగలది. సౌవీర మను 47 జనకరాగము (అసలు యిది సంపూర్ణషాడవము) | స రి గ మ ప ధ ని స= ఆరోహణము. స ని ధ మ గ రి స= అవరోహణము. |
| 2. అవరోహణమందు మాత్రమే సప్తస్వరములుగలది సౌగంధిని యను 37వ జనకరాగము. (ఇది ఔడువ సంపూర్ణము) | స రి మ ప ధ స= ఆరోహణము స ని ధ ప మ గ రి స= అవరోహణము |
| 3. ఆరోహణావరోహణములలో ప్రత్యేకముగ దేనియందును కూడ సప్తస్వరములు లేనిది రూపవతి యను 12 వ మేళ రాగము. | స రి మ ప, ప స సా= ఆరోహణము. స ని ధ ని ప మ గ స= అవరోహణము. |

(ఇది ఔడువ షాడవము, వక్రము కూడాను)

పూర్వము మేళకర్తరాగములలో కూడ వక్రములు గలవనియును, అని సంపూర్ణముగానే యుండ నక్కర లేదని యును పై ఉదాహరణవలన విశదమగుచున్నది.

### 2. జన్య రాగములు

జనకరాగమునుండి పుట్టిన రాగములు జన్య రాగము లనబడుచున్నవి. ఈ జన్యరాగములు

1. సంపూర్ణ షాడవములు
2. షాడవ సంపూర్ణములు
3. షాడవ షాడవములు
4. సంపూర్ణ ఔడువములు
5. ఔడువ సంపూర్ణములు
6. షాడవ ఔడువములు
7. ఔడువ షాడవములు
8. ఔడువ ఔడువములు.

అని ఎనిమిది విధములుగా నున్నవి.

## వివరములు

### 1. సంపూర్ణ షాడవములు

ఆరోహణమందు ఏడు స్వరములును, అవరోహణ మందు ఆరు స్వరములును గలవి సంపూర్ణషాడవరాగములు.

ఉదాహరణము

| | |
|---|---|
| 2వది యగు రత్నాంగి మేళకర్త జన్యము జీవరంజని యను రాగము | స రి గ మ ప ధ ని ṡ= ఆరోహణము. ṡ ధ ప మ గ రి స= అవరోహణము. |

### 2 షాడవ సంపూర్ణములు

ఆరోహణమందు ఆరుస్వరములును, అవరోహణమందు ఏడు స్వరములును గలవి షాడవ సంపూర్ణ రాగములు.

ఉదాహరణము

| | |
|---|---|
| 2వది యగు రత్నాంగి యను మేళకర్త జన్యము రిషభాంగి యను రాగము. | స రి మ ప ధ ని ṡ= ఆరోహణము. ṡ ని ధ ప మ గ రి స= అవరోహణము. |

## 3. షాడవ షాడవములు

ఆరోహణమందును, అవరోహణమందునుకూడ ఆరు స్వరములు గలవి షాడవ షాడవ రాగములుగా చెప్పబడినవి

ఉదాహరణము

| | |
|---|---|
| 1వది యగు కనకాంగి యను మేళకర్త జన్యము | స రి గ మ ప ధ స= ఆరోహణము. |
| వాగీశ్వరి యను రాగము. | స ధ ప మ గ రి స= అవరోహణము. |

## 4. సంపూర్ణ ఔడువములు

అరోహణమందు ఏడు స్వరములును అవరోహణమందు అయిదు స్వరములును గలవి సంపూర్ణ ఔడువ రాగములని చెప్పబడినవి.

ఉదాహరణము

| | |
|---|---|
| 24వది యగు వరుణప్రియ యను మేళకర్త జన్యము | స రి గ మ ప ధ ని స = ఆరోహణము. |
| భానుదీపక మను రాగము. | స ని ప మ రి స= అవరోహణము. |

## ౫. ఔడువ సంపూర్ణములు

ఆరోహణమందు అయిదు స్వరములును అవరోహణమందు ఏడు స్వరములును గలవి ఔడువ సంపూర్ణ రాగములని చెప్పబడినవి.

ఉదాహరణము

| | |
|---|---|
| 24వది యగు వరుణప్రియ యను మేళకర్త జన్యము వీరవసంతమను రాగము. | స రి గ మ ప ṡ= ఆరోహణము. ṡ ని ధ ప మ గ రి స= అవరోహణము. |

6. షాడవ ఔడువములు

ఆరోహణమందు ఆరు స్వరములును, అవరోహణమందు ఆయిదు స్వరములునుగలవి షాడవ ఔడువ రాగములని చెప్పబడినవి.

ఉదాహరణము

| | |
|---|---|
| 4వది యగు వనస్పతి యను మేళకర్త జన్యము రసావళి లేక రసాళి యను రాగము. | స రి మ ప ధ ని ṡ = ఆరోహణము. ṡ ధ ప మ రి స= అవరోహణము. |

7. ఔడువ షాడవములు

ఆరోహణమందు అయిదు స్వరములును అవరోహణమందు ఆరు స్వరములును గలవి ఔడువ షాడవ రాగములని చెప్పబడినవి.

ఉదాహరణము

| | |
|---|---|
| 2వది యగు రత్నాంగి యను మేళకర్త జన్యము శ్రీమణి యను రాగము. | స రి గ ప ధ ṡ=ఆరోహణము ṡ ని ధ ప గ రి స= అవరోహణము. |

### 8. ఔడువ ఔడువములు

ఆరోహణమందు అయిదు స్వరములును అవరోహణమందు అయిదు స్వరములును గలవి ఔడువ ఔడువ రాగములని చెప్పబడినవి.

ఉదాహరణము

| | |
|---|---|
| 28వది యగు హరికాంభోజి యను మేళకర్త జన్యము మోహన యను రాగము. | స రి గ ప ధ స= ఆరోహణము. స ధ ప గ రి స= అవరోహణము. |

---

## 3. వక్ర రాగములు

రాగమున ఆరోహణమందు గాని, అవరోహణమందు గాని లేక రెంటియందుగాని సరిగాది స్వరములు వరుస క్రమమున లేక వ్యత్యస్తముగా నుండినవి వక్రరాగములని చెప్పబడినవి. అందు ఆరోహణావరోహణ క్రమముకూడ వచ్చును. ఈ రాగములలో పూర్ణములు, షాడవములు, ఔడవములు కూడ యుండును.

## ఉదాహరణము

1. 1వది యగు కనకాంగి మేళకర్తజన్యము కనకాంబరియను రాగము. ఆరోహణావరోహణములందు సంపూర్ణము, వక్రము కూడాను.

స రి గ మ ప ధ ని ṡ=ఆరోహణము.

ṡ ని ధ ప మ గ రి గ రి స=అవరోహణము.

2. షాడవ సంపూర్ణము. అవరోహణమందు వక్రము 15వది యగు మాయామాళవగౌళ మేళకర్త జన్యము. లలిత పంచమము అను రాగము.

స రి గ మ ధ ని ṡ=ఆరోహణము.

ṡ ని ధ మ పమగరి స=అవరోహణము.

3. ఔడవసంపూర్ణము. ఆరోహణావరోహణములందు వక్రము. 11వది యగు కోకిలప్రియ మేళకర్త జన్యము శుద్ధ లలితమను రాగము.

స ప మ ధ ని ṡ=ఆరోహణము.

ṡ ని స ధ ప మగరి స=అవరోహణము.

జనక రాగములలో వక్రములుండవు. జనకరాగము వక్రమయిన యెడల అది జన్యరాగముక్రిందికి వచ్చును. గాన వక్రరాగము లన్నియు జన్యరాగములే యగుచున్నవి. ఆరోహణావరోహణములందు సంపూర్ణములైనను వక్రమగుట చేత అట్టిరాగములుకూడ జన్యములుగానే పరిగణింపబడు

# 4. భాషాంగ రాగములు

అన్యరాగ స్వరమును పొందినవి భాషాంగరాగములని చెప్పబడినవి. జనకరాగములందు భాషాంగము లుండవు. జనకరాగము భాషాంగమయ్యేనేని అది జన్యరాగము క్రిందికి వచ్చును. గనుక భాషాంగ రాగములన్నియు జన్యరాగములే యగుచున్నవి. ఆరోహణావరోహణములయందు సంపూర్ణ స్వరములుగల రాగమైనను భాషాంగమైనచో అది జన్య రాగముగనే పరిగణింపబడుచున్నది.

### ఉదాహరణములు

### 1. బిలహరి రాగము

ఇది 29 మేళకర్తయైన ధీరశంకరాభరణ జన్యము.

ఇందు కైశికినిషాదము అన్యస్వరము. ప్రయోగ స్వరములు రాగలక్షణమునందు చెప్పబడుచున్నవి.

### 2. ఆనందభైరవి రాగము

ఇది నఠభైరవి జన్యము. ఇందు అంతరగాంధారము అన్యస్వరము. ప్రయోగస్వరములు రాగలక్షణమునందు చెప్ప బడుచున్నవి. ఇదేవిధమున రాగలక్షణములందు మిగిలిన వానిని తెలియదగును. రాగలక్షణములందు భాషాంగ రాగ ములు జన్యరాగములుగానే చెప్పబడుచున్నవి.

# 5. మిశ్ర రాగములు

రాగములను మిశ్రమముచేసి గానముచేయుట మిశ్రమ మని చెప్పబడినది. రెండు రాగములను మిశ్రమము చేయుట వలన ఏర్పడినదానికి మిశ్రమరాగమని చెప్పుచున్నారు.

## ఉదాహరణము

### 1. చారుకేశి రాగము

ఇది 26వ మేళకర్త రాగము.

దీనిలో పూర్వాంగ స్వరములు (సరిగమ) శంకరాభరణ రాగముయొక్క లక్షణమును ఉత్తరాంగ స్వరములు తోడి రాగలక్షణమును కలిగియున్నవి.

### 2. గౌరీమనోహరి రాగము

ఇది 23వ మేళకర్త రాగము.

ఈ రాగమందు పూర్వాంగ స్వరములు (సరిగమ) భైరవి రాగము యొక్క లక్షణమును, ఉత్తరాంగ స్వరములు శంకరాభరణ రాగముయొక్క లక్షణమును కలిగియున్నవి.

# పూర్వపు రాగవిభాగము

పూర్వము రాగవిభాగమునందు (1) రాగాంగము (2.) భాషాంగము. (3) క్రియాంగము. (4) ఉపాంగము (5) దేశాంగము. అని అయిదు విధములుగా చెప్పబడినవి. ఇవి అన్నియు దేశీయరాగములుగనే చెప్పబడినవి.

## వివరములు

### (1) రాగాంగము

పూర్వము గ్రామరాగము యొక్క ఛాయగల దేశీయరాగము రాగాంగరాగమని చెప్పబడినది. నేడుమాత్రము ఈ పేరును జనకరాగమునకు వినియోగించుకొనుచున్నారు

### (2) భాషాంగము.

పూర్వము భాషయను రాగము యొక్క ఛాయగల దేశీయరాగమునకు భాషాంగమని చెప్పబడినది. నేడు మాత్రము అన్యస్వరము గల రాగము భాషాంగరాగముగా వ్యవహరించుచున్నారు.

### (3) క్రియాంగము

చింత, ఉత్సాహము, కరుణ మున్నగు క్రియలను కలిగించునట్టి దేశీయ రాగము క్రియాంగమని పూర్వము చెప్పబడినది. రాగస్వరములు వక్రముగా (క్రమముతప్పి) గలవి క్రియాంగములని నేడుకొందరు వ్యవహరించుకొనుచున్నారు. కొందరు నేడు క్రియాంగములే లేవని వ్రాయుచున్నారు.

(4) ఉపాంగము

ఉపరాగ ఛాయగలది ఉపాంగము అనియును అంగ ఛాయానుకారిత్వము గలది ఉపాంగమనియును పూర్వము చెప్పబడినది. నేడు మాత్రము మేళకర్త రాగము వలన పుట్టిన షాడవాది జన్యరాగములు ఉపాంగములని వ్యవహరించు చున్నారు,

(5) దేశాంగము.

రెండు దేసిరాగములు కలుపుట వలన పుట్టిన దేశీయ రాగము దేశాంగమని పూర్వము చెప్పబడినది. దీనిని నేను మిశ్రమమని వాడుకొనుచున్నారు. మిశ్రమరాగ పద్ధతి లోగా వివరించబడినది.

## తాళ విషయము

ఈ ప్రకరణమునందు (1) లఘు, (2) మార్గము, (3) క్రియ, (4) చాపుతాళము అను విషయములను గురించి చెప్పబడుచున్నవి.

## (1) లయ

క్రియానంతర విశ్రాంతికాలమునకు లయ అని పేరు. అనగా తాళము వేయునపుడు ఒక హస్తక్రియను వేసిన పిమ్మట తిరిగి ... హస్తక్రియను వేయులోగా నుండు కాలము. ఈ విధముగ రెండు హస్తక్రియల మధ్యనుండు కాలమునకే క్రియానంతర విశ్రాంతికాలమని పేరు.

ద్రుతలయ, మధ్యలయ, విళంబితలయ అని యీ లయలు మూడు విధములుగా చెప్పబడినవి.

# వివరములు

## (1) ద్రుతలయ

గీతము నడచు కాలమునకు రెట్టింపు వేగముగా తాళమును వేసిన అది ద్రుతలయ యని చెప్పబడినది.

### ఉదాహరణము

పాట క్రియకు నాలుగు నాలుగు అక్షరముల కాలము వంతున నడుచుచుండగా తాళమునందు ఒక్కొక్క హస్త క్రియను రెండు రెండు అక్షరముల కాలము వంతున నిలుపుచు తాళమును వేయుట.

## (2) మధ్యలయ

తాళగీతములు (అనగా పాట, తాళము) ఒక కాలము నందే నడచునట్టి కాలము మధ్యలయ కాలమని చెప్పబడినది.

### ఉదాహరణము

పాట (గీతము) క్రియకు నాలుగు నాలుగు అక్షరముల కాలము వంతున నడచుచుండగా తాళమందలి క్రియలను కూడ నాలుగు నాలుగు అక్షరముల కాలము వంతున నిలుపుచు తాళమును వేసిన అది మధ్యలయ యనబడినది అనగా తాళగీతములు సమముగా నడచునట్టి కాలమని తాత్పర్యము.

### (3) విళంబితలయ

మధ్యలయ కాలమునకు రెట్టింపు నిదానముగా తాళము మాత్రమే నడచిన అది విళంబితలయ యని చెప్పబడినది. అనగా గీతము నడచు కాలమునకు రెట్టింపు నిదానముగా తాళము నడచుట యని తాత్పర్యము.

#### ఉదాహరణము

క్రియకు నాలుగు నాలుగు అక్షరముల కాలము వంతున గీతము నడచుచుండగా తాళమందలి క్రియలను ఒక్కొక్క దానిని ఎనిమిది అక్షరముల కాలము వంతున నిలుపుచు తాళమును వేయుటకు విళంబితలయ యని చెప్పబడినది,

---

## 2. మార్గము

తాళము నడచునట్టి కాలప్రమాణమునకు మార్గమని పేరు. తాళమును వేయునపుడు ఒకొక్క హస్తక్రియను ఎంతకాలము వరకు నిలిపి యుంచవలయునో అట్టి కాలభేదములు ఈ మార్గలక్షణము వలన విశదము కాగలవు.

(1) అతిచిత్రతమము, (2) చిత్రతమము, (3) చిత్రతరము, (4) చిత్రము, (5) వార్తికము, (6) దక్షిణము అని మార్గములు ఆరు విధములుగా చెప్పబడినవి. ఈ ఆరున

చతురశ్ర మార్గములు. ఇవి గాక త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణము లను మార్గములు కూడ కలవు.

## వివరములు

### (1) అతిచిత్రతమ మార్గము

తాళమును వేయునపుడు ఒక్కొక్క హస్తక్రియను ఒక అక్షర (అర సెకండు) కాలమువంతున నిలుపుట అతిచిత్రతమమార్గమని చెప్పబడినది.

#### ఉదాహరణము

చతురశ్రజాతి త్రిపుట(ఆది)తాళమునందు గల 8 హస్తక్రియలను ఎనిమిది అక్షరముల కాలములలో నిలుపుట.

| | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| హస్తక్రియలు = | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| అక్షరములు = | త | క | త | క | త | క | త | క |

ఇందు ఒక్కొక్క అక్షరమును అర సెకండు కాలములో ఉచ్చరించవలెను.

### (2) చిత్రతమ మార్గము

ఈ మార్గమున తాళమునందలి హస్తక్రియలు ఒక్కొక్కటి రెండేసి అక్షరముల కాలము వంతున నిలుచును.

ఉదాహరణము

చతురశ్రజాతి త్రిపుట (ఆది) తాళము

| | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| హస్తక్రియలు= | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| అక్షరములు = | తక | తక | తక | తక | తక | తక | తక | తక |

3 చిత్రతర మార్గము

తాళమునందలి ఒక్కొక్క హస్తక్రియను 4 అక్షరముల కాలము వరకు నిలుపుచు తాళమును వేసిన అది చిత్రతరమార్గ మనబడినది.

ఉదాహరణము

చతురశ్రజాతి త్రిపుట తాళము

| | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| హస్తక్రియలు= | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| అక్షరములు = | తక తక | తక తక | తక తక | తక తక | తక తక | తక తక | తక తక | తక తక |

(4) చిత్ర మార్గము

ఒక్కొక్క హస్తక్రియను 8 అక్షరముల కాలము వంతుననడుపుచు తాళమును వేసిన అది చిత్రమార్గమనబడినది.

ఉదాహరణము

చతురశ్రజాతి త్రిపుట తాళము

| | లఘువు | | | |
|---|---|---|---|---|
| హస్తక్రియలు= | 1 | 2 | 3 | 4 |
| అక్కరము = | తకతక తకతక | తకతక తకతక | తకతక తకతక | తకతక తకతక |

| | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|
| హస్తక్రియలు = | 5 | 6 | 7 | 8 |
| అక్షరము = | తకతక | తకతక | తకతక | తకతక |
| | తకతక | తకతక | తకతక | తకతక |

## (5) వార్త్తికమార్గము

ఒక్కొక్క హస్తక్రియను 16 అక్షరముల కాలము వంతున నిలుపుచు తాళమును వేసిన అది వార్త్తిక మార్గ మనబడును.

### ఉదాహరణము

### చతురశ్రజాతి త్రిపుట తాళము

| | లఘువు | | | |
|---|---|---|---|---|
| హస్తక్రియలు = | 1 | 2 | 3 | 4 |
| అక్షరములు = | తకతక | తకతక | తకతక | తకతక |
| | తకతక | తకతక | తకతక | తకతక |
| | తకతక | తకతక | తకతక | తకతక |
| | తకతక | తకతక | తకతక | తకతక |

| | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|
| హస్తక్రియలు = | 5 | 6 | 7 | 8 |
| అక్షరములు = | తకతక | తకతక | తకతక | తకతక |
| | తకతక | తకతక | తకతక | తకతక |
| | తకతక | తకతక | తకతక | తకతక |
| | తకతక | తకతక | తకతక | తకతక |

(6) దక్షిణ మార్గము

ఒక్కొక్క హస్తక్రియను 32 అక్షరముల కాలమువరకు నిలుపుచు తాళమును వేసిన అది దక్షిణమార్గమనబడును.

ఇంతవరకు చెప్పబడిన ఆరుమార్గములును చతురశ్ర మార్గములై యున్నవి. ఈ మార్గములందు మార్గకాలము ననుసరించి మాత్రాకాలమును రెట్టించుటకు గాని లేక నిశ్శేషముగా అర్థించుటకు గాని అవకాశము గలదు. చతురశ్ర యనగా నాలుగు అని అర్థము. ఈ మార్గాక్షరములను నాలుగు చేత భాగించిన ఏ అంశకైనను నిశ్శేషముగా సరిపోవును. ఈ ఆరు మార్గములును ఒకదానికొకటి క్రమముగా ద్విగుణద్విగుణ న్యాయములో నున్నవి. ఇందలి మార్గాక్షరములు సరిసంఖ్యలలో నున్నవి.

ఇకను బేసి అక్షరములుగల త్రిశ్రాది మార్గములు చెప్పబడుచున్నవి.

(7) త్రిశ్ర మార్గము

ఒకొ్కక్క హస్తక్రియను మూడు అక్షరముల కాలము వరకునిలుపుచు తాళమునువేసిన అది త్రిశ్రమార్గమనబడినది.

ఉదాహరణము

చతురశ్రజాతి ఏకతాళము

1. లఘువు

| | | | | |
|---|---|---|---|---|
| హస్తక్రియలు= | 1 | 2 | 3 | 4 |
| అక్షరములు= | తకిట | తకిట | తకిట | తకిట |

## (8) మిశ్ర మార్గము

ఒక్కొక్క హస్తక్రియను 7 అక్షరముల కాలము వరకు నిలుపుచు తాళమును వేసిన అది మిశ్రమార్గమని చెప్పబడినది.

### ఉదాహరణము

చతురశ్రజాతి ఏకతాళము

1. లఘువు

| హస్తక్రియలు= | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|
| అక్షరములు | తకిటతకతక | తకిటతకతక | తకిటతకతక | తకిటతకతక |

## (9) ఖండ మార్గము

ఒక్కొక్క హస్తక్రియను అయిదు అక్షరములకాలము వరకు నిలుపుచు తాళమును వేసిన అది ఖండమార్గమనబడినది.

### ఉదాహరణము

చతురశ్రజాతి ఏకతాళము

1. లఘువు

| హస్తక్రియలు= | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|
| అక్షరములు= | తకతకిట | తకతకిట | తకతకిట | తకతకిట |

## (10) సంకీర్ణ మార్గము

ఒక్కొక్క హస్తక్రియను తొమ్మిది అక్షరముల కాలము వరకు నిలుపుచు తాళమును వేసిన అది సంకీర్ణ మార్గ మనబడినది.

## ఉదాహరణము

### చతురశ్రజాతి ఏకతాళము

1. లఘువు

| | | |
|---|---|---|
| హస్తక్రియలు = | 1 | 2 |
| అక్షరములు = | తకతకిటతకతక | తకతకిటతకతక |
| హస్తక్రియలు = | 3 | 4 |
| అక్షరములు = | తకతకిటతకతక | తకతకిటతకతక |

ఇంతవరకు వివరింపబడిన పదిమార్గములలోను ప్రతి మార్గమునకును మొదటి కాలము, రెండవ కాలము, మూడవ కాలము అను మూడు కాలములు గలవు. ఆయా మార్గములకు చెప్పబడిన మార్గకాలములలోనే గీతము రెట్టింపు రెట్టింపు వేగముగా మూడు కాలములుగ వినియోగమగును.

తాళమందు ఏక కాలమున రెండు మార్గములలో గీతమును నడుపకూడదు. మిగతా వివరములు సంగీత మార్తాండము తాళధ్యాయమునందు విపులముగా చర్చించబడినవి.

# 3. క్రియ

తాళము కొరకు రెండు హస్తముల చేతను చేయబడు సంయోగవియోగముల యొక్క సంజ్ఞలు క్రియలనబడినవి. హస్తముల వలన ఏర్పడుటచేతను యివి హస్తక్రియలన బడినవి.

ఇవి శబ్దక్రియలనియును, నిశ్శబ్దక్రియలనియును రెండు విధములుగా చెప్పబడినవి. ఇందు ధ్వనియగునవి శబ్దక్రియలు. ధ్వనిలేనివి నిశ్శబ్దక్రియలు.

నేడు వాడుకలో గల ధ్రువాది సప్తతాళముల-లోను ఘాత యను శబ్దక్రియ ఒకటే కలదు. ఈ ఘాతకు ధ్రువకమని పేరు. మిగతా వ్రేళ్లను ఎంచుట చేతిని ముందునకు విసరుట అనునవి ఒకప్పుడు నిశ్శబ్దక్రియలు. వ్రేళ్లను ఎంచునట్టి క్రియలు ఒకప్పుడు ధ్రువకక్రియయందలి కాలమునకే సంబంధించి యుండెను. చేతినిముందునకు విసరునట్టి క్రియకు విసర్జిత యని పేరు. నేడు దీనిని 'ఉసి' అని యనుచున్నారు. ఇతర ములగు క్రియల విషయమై రాబోవు భాగములందు వివరింప బడును.

---

# 4. చాపుతాళములు

సాధారణముగా మిశ్రగతిని చాపుతాళమనుచున్నారు కాని చతురశ్రాది జాతులన్నియు కూడ గతులలో ప్రత్యేక తాళములుగ వినియోగమగుట కలదు.

జాతిగా హస్తక్రియలతో తాళమును వేయుటకు వీలు కలుగనంతటి వేగముగా గీతము నడచునపుడు, అందులకు గతితాళములు వినియోగ మగుచున్నవి. గతితాళములలో ప్రతిదానికిని ఆదియందు ఒకటే ఘాతను (దెబ్బను) వేయవలెను. అటుల వేయునపుడు తాళమును నిలుపుట కష్టమని కొన్ని గతులకు రెండుమూడు ఘాతలను కూడ వేయుచున్నారు. చాపుతాళములందలి అక్షరకాలములు చతుర్భాగకాలములోను, కళాకాలములోను వినియోగమగును. చతుర్భాగ కాలమునకు మించిన విళంబితకాలముగల దానిని హస్తక్రియతో జాతితాళముగా వేయుటకు వీలుకలుగును. చతుర్భాగ కాలమనగా పావు శెకండుకాలము. దీనిలో సగము కాలమునకు కళాకాలమని పేరు. ఈ చాపుతాళములు చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణములని అయిదు విధములు.

# వివరములు

## (1) చతురశ్ర చాపుతాళము.

నాలుగు (అక్షరముల) చతుర్భాగాక్షరముల కాలమున గాని లేక నాలుగు కళాకాలాక్షరముల కాలమున గాని ఒక్కొక్క ఘాతను వేయగా గీతమునడచిన అది మిశ్రచాపు తాళమనబడినది.

### ఉదాహరణము

I
త క త క

మీాదను గీటుకల అక్షరము ఘాతకు స్థానము. ఇందలి అక్షరకాలములు విళంబకాలమున వినియోగమైన చతురశ్రి జాతి ఏకతాళమగును.

(2) తిశ్ర చాపుతాళము

ఘాతకు మూడు చతుర్భాగ లేక కళాకాలాక్షరముల కాలము వంతున ఘాతలతోనే ప్రత్యేక తాళముగ వినియోగమైన అది తిశ్రచాపు తాళమనబడినది. దీనికి ఝప్పతాళమను పేరు కూడ కలదు.

ఉదాహరణము.

I
త కి ట

ఇందలి అక్షరకాలములు విళంబముగా వినియోగమైన తిశ్రజాతి ఏకతాళమగును.

(3) మిశ్ర చాపుతాళము.

ఘాతకు 7. చతుర్భాగ లేక కళా కాలాక్షరముల కాలము వంతున ఘాతలతో తాళమును వేయుటకు మిశ్రి చాపు అని పేరు. దీనిని నేడు రెండు ఘాతలతో వినియోగించుచున్నారు.

ఉదాహరణము:-

I       I
త కి ట త క త క

ఇందు త్రిశ్ర—చతురశ్రి అను రెండు గతులు కలసి యున్నవి. దీనిని ఆట తాళమనికూడ వ్యవహరింతురు. ఇందలి అక్షర కాలములు విళంబములైన తిశ్రజాతి త్రిపుట తాళమగును.

(4) ఖండ చాపుతాళము

పై విధముగా ఘాతకు అయిదేసి అక్షరముల వంతున నడచుటకు ఖండ చాపుతాళమని పేరు. నేడు దీనిని రెండు ఘాతలలో వేయుచున్నారు.

ఉదాహరణము.

I I
త క త కి ట

ఇందలి అక్షరకాలములు విళంబములైన యిది. త్రిశ్ర జాతి రూపక తాళమునకు సమానమగును. ఈ ఖండచాపు తాళమునకు కురుజంపెయను వాడుక కూడగలదు

(5) సంకీర్ణ చాపుతాళము

ఘాతకు 9 అక్షరముల వంతున లోగా వివరించిన కాలములలో తాళము నడచిన సకీర్ణచాపుయనబడినది. దీనిని మూడు ఘాతలలో వినియోగించుకొనుచున్నారు.

ఉదాహరణము.

I I I
త క త కి ట త క త క

దీనిని విళంబకాలములో మధ్యఘాత లేకుండా వేసిన ఖండజాతి త్రిపుటతాళమగును

పై చాపుతాళములన్నియు విళంబకాలమున ఒక ఘాతతో వినియోగమైన అన్నియు ఆయా జాతుల ఏక తాళములగును.

# 5. దేశాది తాళము

దేశాది యనినను మధ్యాది యనినను ఒకటేను. ఇందు వరుసగా మూడు ఘాతలును ఒక ఉసిస్సి గలవు. ఈ క్రియలకు రెండు అను ద్రుతములను ఒక ద్రుతమును వరుసగా వేసిన సరిపోవును. చతురశ్రజాతి త్రిపుటతాళము ఈ రూపముగా వేయబడుటచే దేశాది యనబడినది.

ఉదాహరణము—.

తాళాంగములు. U U O

---

# 5. రాగలక్షణములు

ఈ ప్రకరణమున

(1) సావేరి
(2) చక్రవాకము
(3) ఆనందభైరవి
(4) రీతిగౌళ
(5) ఖరహరప్రియ
(6) కేదారగౌళ
(7) హరికాంభోజి
(8) హంసధ్వని
(9) బిలహరి
(10) జగన్మోహిని
(11) పూరికల్యాణి
(12) షణ్ముఖప్రియ
(13) కానడ
(14) చారుకేశి
(15) ఝంఝూటి

అను 15 రాగములకు లక్షణములు వివరింపబడుచున్నవి.

# (1) సావేరి రాగలక్షణము

15వ మేళకర్తయగు మాయామాళవగౌళరాగ జన్యము, 3వ అగ్నిచక్రము ఔడువ సంపూర్ణము.

స్వ ర ము లు

ఆరోహణము : స రి మ ప ధ ṡ

అవరోహణము : ṡ ని ధ ప మ గ రి స

ఆరోహణమందు గాంధారనిషాదములు వర్జ్యములు.

స్వ ర ము ల శ్రు తు లు

అంతరగాంధారము, కాకలినిషాదము, ఇతర స్వరములు శుద్ధములు.

గ్ర హ న్యా సా దు లు

షడ్జము గ్రహస్వరము. ధైవతము న్యాస స్వరము. రిషభ, మధ్యమ, ధైవతములు జీవస్వరములు. ఎల్లపుడును గానము చేయదగును.

స ం వా దు లు

ఇందు స. మ. ప. స్వరములును, రి. ధ. స్వరములును, ఆరోహణమందు మాత్రము గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్ర యో గ స్వ ర ము లు

సరిమపధṡ – సరిమప – రిమప – గరిమప – ṡనిధప

నిధమగరిస – మగరిస – మాగారి స – పమగరి – ṡనిṡనిధా

(ఇందు రెండవ ని. అల్పప్రయోగము).

ఇందు గాంధార నిషాదములు కొన్ని ప్రయోగము లందు నేటి అంతర, కాకలి స్వరముల కంటెను కొంచెము తగ్గియుండును. ఇవి పూర్వపు కాకల్యంతరస్వరము లగు చున్నవి.

ఈ రాగమున శుద్ధములగు రిషభ ధైవతములు ఒక శ్రుతి తక్కువగా పలుకును.

## 2. చక్రవాక రాగలక్షణము

16వ మేళకర్తరాగము　　3వ అగ్నిచక్రము
సంపూర్ణము　　జనకరాగము.

స్వరములు

ఆరోహణము : సా రి గ మ ప ధ ని సా

అవరోహణము : సా ని ధ ప మ గ రి సా

స్వరముల శ్రుతులు

అంతర గాంధారము, చతుశ్రుతి ధైవతము, కైశికి నిషాదము ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. రి. మ. ప. ధ. ని. స్వరములు జీవన్యాసములు. ఎల్లపుడును గానము చేయదగును.

సంవాదులు

ఇందు స. మ. ప. స్వరములు పరస్పరము సంవాదులు.

ప్రయోగస్వరములు

సా మ గ మ ప - మ గ మ ని ధ ని - సా మ మ గ మ,

# 3. ఆనందభైరవి రాగలక్షణము

20. మేళకర్తయగు నఠభైరవి రాగ జన్యము.
4వ వేదచక్రము-సంపూర్ణము. ఆరోహణమందు వక్రము.

స్వ ర ము లు

ఆరోహణము : స గ రి గ మ ప ధ ప ని స

అవరోహణము: స ని ధ ప మ గ రి స

స్వరముల శ్రుతులు

చతుశ్రుతి రిషభము, సాధారణ గాంధారము, కైశికి నిషాదము, ఇతర స్వరములు శుద్ధములు.

అన్య స్వరములు

అంతర గాంధారము, చతుశ్శ్రుతి ధైవతము, కాకలి నిషాదము అన్యస్వరములు.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. గ. మ. ప. ని స్వరములు జీవన్యాసములు. ఎల్లప్పుడును గానము చేయదగును.

స ం వా దు లు

స. మ. ప. స్వరములును, రి. ప. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

చతుశ్శ్రుతి ధైవత ప్రయోగములు

పధనిప – సనిధని – సానిధపా – సానిధనిపా – సనిధప–
పధనిధప – సనిధనిసా,

శుద్ధ ధైవత ప్రయోగములు

పధపమ - మధపగ - సనిధమా

అంతర గాంధార ప్రయోగములు

మగమ - మగరిగ

కాకలి నిషాద ప్రయోగములు

సనిస - రిస నిని సా

## 4. రీతి గౌళరాగ లక్షణము

20. మేళకర్తయగు నఠభైరవి రాగజన్యము.

4వ వేదచక్రము. సంపూర్ణము. ఆరోహణావరోహణము లందు వక్రము. ఘనరాగము.

స్వరములు

ఆరోహణము : స గ రి గ మ ని ధ మ ప ని స

అవరోహణము: స ని ధ మ ప ధ ప మ గ రి స

నేడు కొందరు ఆరోహణమున పంచమ స్వరమును వర్జ్యము చేసి గానము చేయుచున్నారు.

స్వరముల శ్రుతులు

చతుశ్రుతి రిషభము, సాధారణ గాంధారము, కైశికి నిషాదము, ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహన్యాసములు. గ. ని. మ. లు జీవ స్వరములు. సాయంకాలమున గానము చేయదగును.

సం వా దు లు

స. మ. ప. స్వరములును, రి. ప. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

పధపమగరిస - నిధమపనిస - నిసగరిస నిగరిసనిధమా - సనిపానిసా

. . .

# 5. ఖరహరప్రియ రాగలక్షణము

22వ మేళకర్తరాగము. 4వ వేదచక్రము
సంపూర్ణము. జనకరాగము.

స్వ ర ము లు

ఆరోహణము : స రి గ మ ప ధ ని స

అవరోహణము : స ని ధ ప మ గ రి స

స్వరముల శ్రుతులు

చతుశ్శ్రుతి రిషభము, సాధారణ గాంధారము, చతుశ్శ్రుతి ధైవతము, కైశికి నిషాదము, ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహన్యాసములు, గ. ని. జీవస్వరములు ఎల్లపుడును గానము చేయదగును.

సంవాదులు

స మ ప స్వరములును: రి. ధ స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

రిగరిస - పధనిప - రిగమగారి - మగారిస - నీధపమ గారిస - సనీధపమా - పధనిధపమగారిస.

## 6. కేదారగౌళరాగ లక్షణము

28వ మేళకర్తయగు హరికాంభోజిరాగజన్యము 5వ బాణచక్రము. ఔడువ సంపూర్ణము.

స్వరములు

ఆరోహణము : స రి మ ప ని స

అవరోహణము: స ని ధ ప మ గ రి స

ఆరోహణమందు గ. ధ స్వరములు వర్జ్యములు.

స్వరముల శ్రుతులు

చతుశ్రుతి రిషభము, అంతర గాంధారము, చతుశ్రుతి ధైవతము, కైశికి నిషాదము ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

రిషభము గ్రహన్యాసములు. రి. ని. ప. స్వరములు జీవ స్వరములు. సాయంకాలమున గానము చేయదగును.

సంవాదులు

స. మ. ప స్వరములును, రి. ప. స్వరములును, రి. ధ.

స్వరములును, అవరోహణమందు ని. గ లును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

మగరీ - రిమపనిధప - పసానిధప - మనీధప - మపధపామగరీ - గరిసా ని ధ పా నీ సా.

## 7. హరికాంభోజిరాగ లక్షణము

28వ మేళకర్తరాగము 5వ బాణచక్రము.
సంపూర్ణము జనకరాగము

స్వ ర ము లు

ఆరోహణము : స రి గా మ ప ధ నీ స

అవరోహణము : స నీ ధ ప మ గా రి స

స్వరములకు శ్రుతులు

చతుశ్రుతి రిషభము, అంతర గాంధారము, చతుశ్రుతి ధైవతము, కైశికి నిషాదము. ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. గ. ధ. స్వరములు న్యాసములు. ని. మ. లు జీవ స్వరములు. ఎల్లపుడును గానము చేయదగును.

సం వా దు లు

స. మ. ప. స్వరములును, రి. ప. స్వరములును, రి. ధ. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగములు

ధ ని స నీ ధ ప - ప ధ ని ధ ప మ గ మా -

మ ప ధ ని స - స రి గ మ గ రి స

స నీ ధ ప మ గ రి సా.

## 8. హంసధ్వనిరాగ లక్షణము

29వ మేళకర్తయగు ధీర శంకరాభరణ రాగజన్యము 5వ బాణచక్రము. ఔడువఔడువము.

స్వరములు

ఆరోహణము : స రి గ ప నీ స

అవరోహణము : స ని ప గా రి స

మ. ధ. స్వరములు వర్జ్యములు.

స్వరముల శ్రుతులు

చతుశ్రుతి రిషభము, అంతర గాంధారము, కాకలి నిషాదము ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

గాంధారము గ్రహస్వరము. స. ప. స్వరములు న్యాసములు. గ. ని. లు జీవస్వరములు. ఎల్లప్పుడును గానము చేయదగును.

సంవాదులు

స. ప. స్వరములును, రి. ప. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగములు

రిగపాగరి - గపనీ - నిసరిసనిపా - పనిసనిపా - గపనిపాగరి - పగారిసా.

## 9. బిలహరిరాగ లక్షణము

29వ మేళకర్తయగు ధీరశంకరాభరణ రాగజన్యము. 5వ బాణచక్రము. ఔడువ సంపూర్ణము.

స్వ ర ము లు

ఆరోహణము : స రి గ ప ధ స

అవరోహణము : స ని ధ ప మ గ రి స

ఆరోహణమందు మ. ని. స్వరములు వర్జ్యములు.

స్వరముల శ్రుతులు

చతుశ్రుతి రిషభము, అంతర గాంధారము, చతుశ్రుతి ధైవతము, కాకలి నిషాదము. ఇతర స్వరములు శుద్ధములు.

అన్యస్వరము

కైశికి నిషాదము అన్యస్వరము.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. పంచమము న్యాసస్వరము. రి. ధ. లు జీవ స్వరములు. ఎల్లపుడును గానము చేయదగును.

సంవాదులు

స. ప. స్వరములును, రి. ప. స్వరములును, రి. ధ. స్వరములును, గ. ని. స్వరములును అవరోహణమందు మాత్రము స. ప. మ. స్వరములును, పరస్పరము సంవాదులు. అన్యస్వర ప్రయోగములందు గ. ని. స్వరములకు సంవాదిత్వము లేదు.

ప్రయోగములు

మగరిగపా - గపసనిధపా - గపమగరిస - సనిధాసా

నినిధా - రిసనిధా - గరిసనిధా - సనిధపా.

కైశికి నిషాద ప్రయోగములు

పధని పధపా - పధనిధ పమగరి.

## 10. జగన్మోహినిరాగ లక్షణము

15వ మేళకర్తయగు మాయామాళవగౌళరాగ జన్యము. 3వ అగ్నిచక్రము. ఔడువ షాడవము.

స్వరములు

ఆరోహణము : స గ మ ప ని స

అవరోహణము : స ని ప మ గా రి స

ఆరోహణమందు రి. ధ. స్వరములును, అవరోహణమందు ధ. స్వరమును వర్జ్యములు.

స్వరముల శ్రుతులు

అంతర గాంధారము, కాకలి నిషాదము. ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. గాంధారము న్యాసస్వరము. గ. ని. లు జీవ స్వరములు.

సంవాదులు

స. మ' ప. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు,

ప్రయోగ స్వరములు

పనిసనిపమగా – గమపని పమగా – గమపనిస –

నిసగామ గరిస – సని పమగా – గమ పని పమ గరిస–

నిపమగరిస – సనిపసని పమగరిస – గపమగా –

గమపని పసాని పమగా – సమా–గపా–మనీ–పసా.

## 11. పూరికల్యాణిరాగ లక్షణము

53వ మేళకర్తయగు గమనశ్రమరాగ జన్యము' 9వ బ్రహ్మచక్రము. సంపూర్ణము. ఆరోహణమందు వక్రము'

స్వరములు

ఆరోహణము : స రి గ మ ప ధ స ధ స

అవరోహణము : స ని ధ ప మ గ రి స

స్వరముల శ్రుతులు

అంతర గాంధారము, ప్రతి మధ్యమము, చతుశ్శ్రుతి ధైవతము, కాకలి నిషాదము. ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. ధైవతము న్యాసస్వరము రి. మ. ధ. ని. లు జీవస్వరములు. సాయంకాలమున గానము చేయదగును.

సంవాదులు

స. ప. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

పధనిధాప - ధపసాస - పధపనీధపమ - ధపమగా - నిధపమగా - సగరి గా మగారిస - ధపనీధపమ - గమపగారిసా.

ఈ రాగమున మధ్యమము ప్రతి మధ్యమమునకంటెను ఒక శ్రుతి హెచ్చుగా పలుకును.

## 12. షణ్ముఖప్రియరాగ లక్షణము

56వ మేళకర్తరాగము. 10వ దిశిచక్రము. సంపూర్ణము. జనక మేళము.

స్వరములు

ఆరోహణము : స రి గ మ ప ధ ని స

అవరోహణము : స ని ధ ప మ గ రి స

స్వరములకు శ్రుతులు

చతుశ్శ్రుతి రిషభము, సాధారణ గాంధారము, ప్రతి

మధ్యమము, కైశికి నిషాదము. ఇతర స్వరములు శుద్ధములు. ప్రతి మధ్యమము పంచమస్వర సంబంధముగా పలుకును.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము, ప. మ. రి. లు న్యాస స్వరములు, రి. గ. మ. నీ. లు జీవ స్వరములు. ఎల్లప్పుడును గానము చేయదగును.

సంవాదులు

స. ప. స్వరములును, రి. ప. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగములు

ధనిసనీధపమ — ధనిసరిగారిసనీధప — మపధనిసా — రిగమాగరిస — నీధపమగారిసా.

## 13. కానడరాగ లక్షణము

22వ మేళకర్తయగు ఖరహరప్రియరాగ జన్యము. 4వ వేదచక్రము. సంపూర్ణము — వక్రరాగము.

స్వరములు

ఆరోహణము : స రి గ మ ప మ ధా ని సా

అవరోహణము : స ని స ధా ప మ ప గా మ రి స

స్వరముల శ్రుతులు

చతుశ్రుతి రిషభము, సాధారణ గాంధారము, చతు

శ్రుతి ధైవతము, కైశికి నిషాదము, ఇతర స్వరములు శుద్ధములు.

 గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. గాంధారధైవత స్వరములు జీవన్యాసములు.

సంవాదులు

స. మ. ప. స్వరములును, రి. ధ. స్వరములును, రి. ప. స్వరములును, గ. ని. స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

సనిపమపగా – సధనిపగా – ధపగా – పగా – మరీ – రిగమపధనీప – గామరిసా.

## 14. చారుకేశిరాగ లక్షణము

26వ మేళకర్తరాగము. 5వ బాణచక్రము.
సంపూర్ణము. జనకరాగము.

స్వరములు

ఆరోహణము : స రి గ మ ప ధ ని స

అవరోహణము : స ని ధ ప మ గ రి స

స్వరముల శ్రుతులు

చతుశ్రుతి రిషభము, అంతర గాంధారము, కైశికి నిషాదము, ఇతర స్వరములు శుద్ధములు.

గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహాస్వరము, గ. ని. స్వరములు జీవన్యాసములు. ఎల్లప్పుడును గానము చేయదగును.

సంవాదులు

స. మ. ప స్వరములును, రి. ప స్వరములును పరస్పరము సంవాదులు.

ప్రయోగ స్వరములు

గమపధపమగా - ధనిసనీధప - సరిగమగరిసా -

నిధనిసా - నిధపామగా - గమగరిసా.

## 15. జంఝూటిరాగ లక్షణము

28వ మేళకర్తయగు హరికాంభోజిరాగజన్యము. 5వ బాణచక్రము. సంపూర్ణము - నిషాదాంత్యరాగము.

స్వరములు

ఆరోహణము : ధ స రి గ మ ప ధ ని

అవరోహణము : ధ ప మ గ రి స ని ధ ప ధ స

ఆరోహణమందు మంద్ర నిషాద వర్జ్యము.

స్వరముల శ్రుతులు

చతుశ్రుతి రిషభము, అంతర గాంధారము, చతుశ్రుతి ధైవతము, కైశికీ నిషాదము, ఇతర స్వరములు శుద్ధములు.

అన్య స్వరము

సాధారణ గాంధారము.

### గ్రహన్యాసాదులు

షడ్జము గ్రహస్వరము. రి, గ. స్వరములు న్యాసములు. మ. ధ లు జీవస్వరములు.

### సంవాదులు

స. మ. ప. స్వరములును, రి. ప స్వరములును, రి. ధ. స్వరములును పరస్పరము సంవాదులు.

### ప్రయోగములు

మాపధనిధపా – మధపమగా – గపమపమగా –

గమాగరిసా – నిధపా – ధసా.

### సాధారణ గాంధార ప్రయోగము

రీగరి – గరిరి స.



# 6. సంగీతరచనలు

(1) సంచారిగీతము
(2) తానవర్ణము
(3) పదము
(4) పదవర్ణము

## (1) సంచారిగీతము

సాధారణమైన గీతమును బోలియుండును. పల్లవి మున్నగునవి యిందుండవు. మాతువు(సాహిత్యము) ఉండదు. రాగస్వరూపమును సులభముగా వ్యక్తముచేయు స్వరనడకలతో కూడియుండును. తాళబద్ధమైన యిట్టి సంచారిగీతములను సుబ్బరామదీక్షితులవారు చెప్పియున్నారు. సంగీత సాంప్రదాయ ప్రదర్శని యను గ్రంథమునందు ఉదహరింపబడినవి.

సంచారి యనునది ఆరోహి, అవరోహి, స్థాయి, సంచారియను చతుర్విధాలంకారములలో ఒకవిధమగు స్వరాలంకారమునకు పేరు, అట్టి స్వరపునడకలను గలిగి యుండుటచే సంచారిగీత మనబడినది. నేడు సాధారణ గీతములను కూడ సంచారగీతములుగా వ్యవహరించుచున్నారు.

## (2) తానవర్ణము

తానవర్ణము మధ్యమకాలములో యుండును. పల్లవి, అనుపల్లవి, చరణములను కలిగియుండును. వీట్లయందు మాతువునందు (సాహిత్యములో)గల ప్రతి అక్షరమునకును అకార ఇకారాదులు విశేషముగా యిమిడియుండును. అనుపల్లవి, ముక్తాయిస్వరము, చరణము వీట్ల స్వర క్రమములు చౌకవర్ణము నందు వలెయుండును,

ఇందు పల్లవి, అనుపల్లవి, ముక్తాయి స్వరములను క్రమముగా గానము చేసిన పిమ్మట తిరిగి పల్లవిని ఎత్తుగడ జేయవలెను. అటు పిమ్మట చరణమును, చరణస్వరమును గానము చేయవలెను. ప్రతి చరణమును ఈ మాదిరిగానే గానము చేయుచు వర్ణమును ముగించవలయును. తాన వర్ణమునందు పల్లవి-అనుపల్లవి చరణములకు మాత్రమే సాహిత్యముండును. మిగతా భాగములందు కేవలము స్వరములే యుండును.

స్థాయి, ఆరోహి, అవరోహి, సంచారి అను చతుర్విధ వర్ణాలంకారములతో కూడినది వర్ణమని శాస్త్ర నిర్ణయము. స్త్రీకి ఆభరణము లెటుల శోభకు కారణములో రాగమందు రంజకత్వము కలిగి శోభించుటకుగాను ఈ వర్ణాలంకారములు అంతటి ముఖ్యముగా చెప్పబడినవి.

రాగభావమును వ్యక్తము చేయుగల సంచారి స్వర నడకలు వర్ణమునందుండును. అందు వలననే రాగస్వరూపము వర్ణమందు స్పష్టమగుచున్నది. ఈ కారణముచేత కీర్తనకంటెను ముందుగా వర్ణములు చెప్పబడుచున్నవి.

తాన వర్ణములను రచియించిన వారిలో ముఖ్యులు, పచ్చిమిరియం ఆదిఅప్పయ్య, తిరువత్తూరు త్యాగయ్యర్, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ మొదలగువారు.

(3) పదము

సామాన్యముగా పాడుకొను పాటలను పదములని గ్రామములందు అనుకొనుచుందురు గాని యిచ్చట ప్రకర

ణము ననుసరించిన పదములు మాత్రము ఆ ప ద ము లు
గాజాలవు. ఈపదములకు సభ్యతతో కూడిన శాస్త్రముకలదు

స్వీయ, పరకీయ, సామాన్య అను నాయికలు చేష్ట
చేతను గుణములు మున్నగు లక్షణములచేతను అనేక విధము
లుగా రసప్రకరణమునందు వర్ణింపబడిరి.

నాయికయొక్క గుణములు, అందులకు సంబంధించి
చేష్టలు, మాటలు మున్నగువాని లక్షణముల ననుసరించి ప
ములు చెప్పబడెను. ఇందు శృంగారరసము ప్రధానము
ఇవి నృత్య కాలక్షేపములందు అభినయమునకు యోగ్యవ
లుగా నున్నవి. వీనిని విళంబకాలములో గానము చేయుదుర
ఇందు కీర్తనలకువలె పల్లవి, అనుపల్లవి, చరణము యుండున
చివరను అంకితముండును. పదములకు సభాగౌరవము కలద
ఈ పదములలో క్షేత్రయ్యపదములు, సారంగపాణి పదముల
పరిమళరంగని పదములు, కస్తూరిరంగని పదములు, మన్నా
రంగని పదములు, మదనగోపాలస్వామి పదములు, ఘ
శీతయ్యగారి పదములు, శోభనాద్రివారి పదములు, ఘటప
వారి పదములు, సంపెంగమన్నారు పదములు, జటపల్లివా
పదములు మున్నగున వెన్నియో కలవు.

(4) పదవర్ణము (చౌకవర్ణము)

వర్ణముయొక్క మర్యాద అన్నిటికిని ఒకటే అయిన
తానవర్ణమునందుకంటె పదవర్ణమునందు సాహిత్యభాగ

యించుమించు స్వరసమానముగా యుండును. నృత్య ప్రదర్శ నము కొరకు ఏర్పడినవగుటచే విళంబకాలమున స్వరపరచబడి నవి. పాటయందు ఒకసంగతినిఅని తిరిగిరెండవసంగతి అనుటకు లోగా మొదటి సంగతియందలి సాహిత్యార్థమునకు సంభంధిం చిన ఆంగికాది ప్రకటన లయానుగుణ్యముగ జరుగవలయును గాన విళంబకాలముననే యివి గానముచేయవలసిన అవసర మేర్పడుచున్నది.

పై కాలములందు పదవర్ణమును గానముచేయుచు ఆంగి కాదులను వేగములో ప్రకటించినను అట్టిది పాండిత్యమును ప్రకటించుకొనుటకు ఉపకరించునేగాని సర్వులును గ్రహించు టకు వీలగునంతటి విపులముగ భావప్రకటన అందుజరుగ జాలదు. అందువలన విళంబకాలములో పదవర్ణమును అభిన యించినపిమ్మట అనుపల్లవి అంతమున స్వరముచేతను, వాద్యా క్షరములగు శబ్దముచేతను పైకాలపు ఆవర్తములు ముక్తాయి స్వరముతో చెప్పబడినవి. ఇట్టి పదవర్ణములే చౌకవర్ణములన బడుచున్నది.

పల్లవిశేషయ్యర్, సుబ్బరామదీక్షితులు రామస్వామి దీక్షితులు, రామస్వామిశివన్ - మైసూరు సదాశివరావు, గోవిందసామయ్య మున్నగువారు పదములను రచించిన వారిలో సుప్రసిద్ధులు.

(5) కృతి లేక కీర్తన

గానయోగ్యమగు సాహిత్యము గద్యము, పద్యము, పదము అని మూడువిధములు. మాత్రాగణములతో కూడి

నదిగద్యము. వర్ణగణములతో కూడినది పద్యము. యిక ప్రక
తావసరమయినది పదము. ఇచ్చట పదమన కీర్తనయు
తాత్పర్యము. కీర్తన, కృతి మున్న నవి సమానార్థకము
తాళబద్ధముగ చేయబడినవిగాన కృతులనబడినవి. కీర్తిం
బడునవిగాన కీర్తన లనబడినవి.

కృతు లనేకరీతులలో తాళముల ననుసరించి చెప్పబ
నవి. తాళముయొక్క దశప్రాణములలో త్రికాలములు, త్రి
యలు, గ్రహములు, మార్గములు, యతులు గతులు చా
ముఖ్యములు. అనేకరీతుల తాళములతో ఈ విశేషము
కృతులందుచేరి కృతుల రీతులు అనంతము లైనవి. అన్నిం
కృతులే యైనను దేశీయ వ్యవహారములో వాట్ల పోకడ
మున్నగువాని ననుసరించి అనేక పేర్లు ఏర్పడినవి.

ఉదాహరణములు.

I త్యాగరాజు చెప్పినవి త్యాగరాజకృతు లనబడుచున్న
కొందరు త్యాగరాజ కీర్తన లనికూడ వ్యవహరిం
చున్నారు.

II శ్రీ నారాయణ తీర్థులవారి కృతులను తరంగము ల
చున్నారు. శ్రీ కృష్ణలీలా తరంగిణి యందలి ప్రకరణ
లకు తరంగములని పేర్లు. అంజలి కీర్తనలనుకూడ ఆ పే
తోనే వ్యవహరించుచున్నారు

III సుబ్రహ్మణ్య కవిగారి రచనలను అధ్యాత్మ రామాయణ కీర్తన లనుచున్నారు.

IV రామదాసు కీర్తనలు అనుచున్నారు ఇటులనే వివిధ రచనలన్నియు కీర్తనల క్రిందికే వచ్చును.

వీనిలో త్యాగరాజకీర్తన లందు పల్లవి, అనుపల్లవి, చరణము అనుధర్మములో నున్నవి. ఇందు సాధారణముగ ఒకటిరెండు చరణములే యున్నవి. ఎక్కువ చరణములుగలవి తక్కువగా యున్నవి.

అధ్యాత్మ రామాయణ కీర్తనలందు పల్లవి నడకవలె అనుపల్లవి కొంతవరకు నడచిన పిమ్మట పై కాలముగలదు. ఈ కీర్తనలలో చరణము చివర పై కాలముండును.

తరంగములందు చరణములన్నియు పల్లవి అను పల్లవి ధర్మములను కలిగి ఒకమాదిరిగానే యుండును. అచ్చటచ్చట మాత్రము పల్లవి అను పల్లవులు చరణముతో సమానమైన సాహిత్యము గలవిగా చెప్పబడినవి. కొన్ని తరంగములందు చరణమున కొక మాదిరి నడక గలదు. కొన్నిటికి చివరను వాద్యాక్షరములతో కూడిన (తోధిమ్మిణాంగిణ) శబ్దము కలదు.

ఈవిధముగ కృతులు అనేకరీతులలో నున్నవి. గాన యోగ్యములగు ఈ రచన లన్నియు గాన ప్రబంధము లన బడినవి.

కొన్నిటికి చివరను చిట్టస్వరములు చెప్పబడినవి. కొన్నిటికి చివరను శబ్దము చెప్పబడినది. నేడుమాత్రము త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామాశాస్త్రి. పట్నంసుబ్రహ్మణ్యాయర్ మున్నగువారు రచించిన వానిని మాత్రమే కృతులనుచున్నారు. శృంగారరస ప్రధానములై అభినయమునకు ప్రధానమైన కృతులను పదములనుచున్నారు ఇటులనే మిగిలిన వానిని తరంగములని, కీర్తనలని, అష్టపదులని, అర్థముచేతనో, భాషచేతనో, స్వరముచేతనో, వాట్ల వినియోగ సందర్భము ననుసరించియో ఏర్పడిన పేర్లతో వ్యవహరించుచున్నారు

ఈ విషయమై సంగీతమార్తాండము ప్రబంధాధ్యాయమున సోదాహరణముగ వివరింపబడును.

—[ ० ]—

# 7. వాగ్గేయకారుల చరిత్ర

(1) త్యాగరాజు

(2) ముత్తుస్వామి దీక్షితులు

(3) శ్యామాశాస్త్రి

## (1) త్యాగరాజు

త్యాగరాజు పూర్వులు కర్నూలు జిల్లాలోని కంభము ప్రాంతమువారను ప్రతీతిగలదు. ఆ కాలమున తంజావూరు ప్రభుత్వమునకు ప్రధాన స్థానమగుటచే విద్వాంసు లందరును రాజాస్థానమునకు చేరుచుండిరి. ఆ విధముగనే త్యాగరాజు పూర్వులుకూడ వెళ్లియుండిరి.

త్యాగరాజు ఆరువేలనియోగి బ్రాహ్మణుడు. ఇంటి పేరు కాకర్లవారు. భరద్వాజసగోత్రము. ఈయన మురికినాటి బ్రాహ్మణుడని కొందరనుచున్నారు. కాకర్లవారు ఆరువేలనియోగి బ్రాహ్మణులలో నేటికిని గుంటూరుజిల్లాలో గలరు.

త్యాగరాజు తాతగారు గిరిరాజకవి. సుమారు 300 సంవత్సరముల క్రిందట ఈయన తంజావూరుకు సమీపమునగల తిరువళ్లూరు అను పట్టణమున నివసించుచుండెను. ఈ గిరిరాజ కవికి అయిదుగురు కుమారులు. అందు కడపటివాని పేరు

రామబ్రహ్మము. వీరిది పండిత వంశము. వీరు రామభక్తులు. తిరువళ్లూరునందు జీవనముజరుగుటకు కష్టముగా నుండినందున రామబ్రహ్మము తిరువళ్లూరును వదలి పంచనదక్షేత్రమున నివాస మేర్పరచుకొనెను. ఈ క్షేత్రమునకు తిరువయ్యారని పేరు. ఈ రామబ్రహ్మముగారి మూడవ కుమారుడే త్యాగరాజు.

త్యాగరాజు కలియుగము 4859 సం॥ సరియగు క్రీ. శ. 1759 బహుధాన్య సంవత్సరమున తిరువయ్యారు (పంచనద క్షేత్రము) నందు జన్మించెను. కొద్దివయస్సులోనే సాంగ వేదాధ్యయనపరుడయ్యెను. పిమ్మట తమవీధియందే నివసించు చుండిన సంస్థాన వైణిక విద్వాంసుడగు శొంఠి వెంకట రమణయ్యగారివద్ద సంగీతము నభ్యసించుటకు ప్రారంభించి ఏక సంతగ్రాహియై ఒక సంవత్సరమునకే అసమానమైన పాండిత్యమును గడించెను.

ఇట్లుండ కాంచీపురమునుండి పంచనదక్షేత్రమునకు వచ్చియుండిన ఒక పరమ భాగవతోత్తమునివద్ద శ్రీరామ నామ మంత్రోపదేశమును పొందెను. 96. కోట్ల శ్రీరామ నామ మంత్రమును జపము చేసినవారు ముక్తులు కాగలరని ఆ భాగవతోత్తముని వలన తెలిసికొని త్యాగరాజు ఆరోజు మొదలు రోజుకు 125000. ల. శ్రీరామనామము వంతున 96 కోట్ల రామ నామ జపమును పూర్తి జేసెను.

పిమ్మట శ్రీరామచంద్రమూర్తి దర్శనమిచ్చి కీర్తన లను జేయునట్లను గ్రహించెను. వివాహమైన పిమ్మట కొంత కాలమునకు త్యాగరాజుని తల్లిదండ్రులు కాలము జేసిరి.

ఒకనాడు రామచంద్రమూర్తి లక్ష్మణస్వామితోను, విశ్వామిత్ర మహర్షితోను యాగ సంరక్షణార్థమై వెడలు చున్నటుల త్యాగరాజుకు దర్శనమిచ్చి అంతర్ధానము జెందెను. వెంటనే అప్రయత్నముగా "బాలకనకమయచేల" అను కీర్తన రూపమున అఠాణారాగములో శ్రీరామ చంద్రమూర్తి స్తుతించెను. ఈ కీర్తనను విని అప్పటి పండితులగు రామశేష శాస్త్రిలు, భావ్యంకృష్ణ శాస్త్రిలు మున్నగువారు ఆశ్చర్య పడినవారై త్యాగరాజును గంధర్వుడో, నారదుడో యని నుతించిరి.

త్యాగరాజుని జీవితములో తటస్థించిన అనేక ఘట్టములలో ఆయా సందర్భముల ననుసరించి అప్పటికప్పుడే అనేక కీర్తనలను భక్తిపరముగ జెప్పియుండిరి. కీర్తనలందు భాష సరళమైనది. పదపొందిక, యమకము, భావము మున్నగు సులక్షణములన్నియు త్యాగరాజుని కీర్తనలకే పట్టినవి. ఈ కీర్తనలు పల్లవి, అనుపల్లవి చరణము అని మూడు భాగములలో చెప్పబడినవి. అచ్చటచ్చట చరణములు పై కాలములో చెప్పబడినవి. కొన్ని కీర్తనలందు పల్లవి, అనుపల్లవి, చరణములు మూడును సమానమైన సాహిత్యము గలవిగా నున్నవి. చాలవరకు ఒకటిరెండు చరణములలోనే కీర్తనలు ముగింపబడినవి. ఎక్కువ చరణములు గలవి తక్కువగా యున్నవి. త్యాగరాజు సంగీత శాస్త్ర గ్రంథములను సవిమర్శముగ జదివెను. లక్ష్యలక్షణాను భవముతో శాస్త్రగ్రంథము లందలి లక్షణములను తనకీర్తనలందు చేర్చిచెప్పెను. కొన్ని కీర్తనల

యందలి అర్థములు సంగీత లక్షణ శ్లోకములయొక్క తాత్పర్య ములే యైయున్నవి.

(1) "ప్రాణానల సంయోగమువలన ప్రణవనాదము"

(2) మూలాధారజ నాదమెరుంగుట ముదమగు మోక్షమురా

(3) శోభిల్లు సప్తస్వర సుందరుల భజింపవే మనసా

(4) నాదోపాసనజేసి శంకర నారాయణ విధులు వెలసిరి.

ఇత్యాదులలో కీర్తనలందు సంగీత రహస్యములు బోధింపబడినవి. మానవకృతములగు సంగీత శాస్త్రగ్రంథము లన్నిటిలోను సంగీత రత్నాకరము ముఖ్యమైనది. అందలి లక్షణములను త్యాగరాజు తన కీర్తనలలో నిమిడ్చిచెప్పెను. అందువలననే "విదులకు మ్రొక్కెద" అనుకీర్తనలో "సోమే శ్వర శార్ఙ్గదేవ నందీ ప్రముఖులకు త్యాగరాజ వంద్యులకు" అని సంగీత రత్నాకర గ్రంథకర్తయైన శార్ఙ్గదేవుని వంద్యు నిగా జెప్పెను. అందు సోమేశ్వరునికూడ చేర్చినందున అయన గ్రంథమైన రాగవిబోధయను గ్రంథమును కూడ గౌరవించి నట్లు విశద మగుచున్నది.

త్యాగరాజుని భక్తికిని, గానమునకును మెచ్చి నారద మహాముని స్వప్నమందు దర్శనమిచ్చి "స్వరార్ణవమను గ్రం

ధమును యిచ్చి వెళ్లెను. నిద్రనుండిలేచి తనప్రక్కన స్వారార్ణవ మను గ్రంథముండుట జూచి నారదునకు తనయందుగలిగిన అనుగ్రహమునకు బ్రహ్మానంద భరితుడైయ్యెను. ఆ గ్రంథము నందలి మర్మములను గ్రహించి త్యాగరాజు ధన్యుడయ్యెను. త్యాగరాజ కీర్తన లందలి అపూర్వమైన లక్షణములు అం దుండి గ్రహించిన వేయై యుండును, ఈయన అనేక క్షేత్ర ములను దర్శించి అచ్చటి దైవములను కీర్తనలతో స్తుతి జేసెను.

త్యాగరాజు సమస్త శాస్త్రముల సారమును మధుర మగు సులభశైలిని చిన్నచిన్న పదములతో భక్తి రసమున కీర్తనల రూపమున తరుణోపాయము కొరకు లోకమునకు అనుగ్రహించిన మహనీయుడుగాని సామాన్య వ్యక్తి కాడు. ఈయన ప్రహ్లాదవిజయము, నౌకాచరిత్ర, సీతారామ విజ యము, అను గ్రంథములను కూడ చెప్పెను

త్యాగరాజు నిరంతరము రామనామ సంకీర్తనమున కాలము గడుపుచు శ్రీరామచంద్రమూర్తి అనుగ్రహమున మరొక జన్మమునగాని తనకు మోక్షములేదని తెలిసికొని అట్టి ఆటంకము తొలగ గలందులకుగాను వెంటనే సన్యసించెను. సన్యాసము మానవునకు మరొక జన్మయని చెప్పబడినది. అందువలన త్యాగరాజు మరొకజన్మ నెత్తవలసిన యవసరము లేకయే మోక్ష ప్రాప్తికి అర్హుడయ్యెను. దేహమును చాలించు కాలమును గుర్తెరింగినవాడై తనశిష్యులును, కుమా ర్తెయు సమక్షమందుండగా అందరును భగవన్నామము

చేయుచుండ కలియుగము 4948 సం॥ సరియగు క్రీ. శ. 6-1-1847 పరాభవనామ సంవత్సర పుష్యబహుళ పంచమి బుధవారము రోజున శ్రీరామషడక్షరీ మహామంత్రమును జపించుచు కపాలమోక్షముకాగా సిద్ధిపొందెను. అదియొక మహాపర్వపు దినము. ఆరోజున త్యాగరాజును కోల్పోయిన వారెట్లుండిరో ఆ స్థితి వర్ణింప నలవికానిది. త్యాగరాజు అనంతరము స్వరార్ణవమను గ్రంథము తిరిగి యథాస్థానము నకు జేరెను.

త్యాగరాజుకు వీణకుప్పయ్య, వాలాజీపేట వెంకట రామ భాగవతులు, అయ్యాభాగవతులు, సుబ్బరామ భాగవతులు, తిలస్థానం రామయ్యంగారు, ఉమయాంపురం కృష్ణ భాగవతులు, సుందర భాగవతులు అను శిష్యులుండిరి.

సంగీతము త్యాగరాజుచేత పునరుద్ధరింపబడినది. అట్టి సంగీతమును త్యాగయ్యగారి శిష్యులు కొంతవరకు లోకమున వ్యాపింపజేసిరి.

ఈ నాటికిని త్యాగరాజ కీర్తనలను విని ఎందరో ఆనందించుచున్నారు. ఎందరో త్యాగరాజ కీర్తనల మూలమున జీవించుచున్నారు.

త్యాగరాజ కీర్తనలను, అందలి విశేషములను వ్రాయ వలయుననిన అదియొక గొప్ప గ్రంథమే కాగలదు.

... ... ... ...

# (2) ముత్తుస్వామి దీక్షితులు

ముత్తుస్వామి దీక్షితులు శా. శ. 1697. క్రీ. శ. 1775 సంవత్సరమునకు సరియగు మన్మథసంవత్సరమున తంజావూరు ప్రాంతమున గల తిరువారూరిలో జన్మించెను. ఈయన 16 సంవత్సరముల లోపలనే క్రియాంతము వేదాధ్యయనము, వ్యాకరణశాస్త్రము, కావ్య నాటకాలంకారములు వీట్లయందు మంచి పండితుడయ్యెను. మరియు జ్యోతిషము, వైద్యము. మంత్రము మున్నగు శాస్త్రములందుకూడ మిగుల ప్రజ్ఞ గలవాడై ప్రఖ్యాతినొందెను. సంగీతమును నేర్చి అందు గొప్ప పండితుడయ్యెను.

చిదంబరనాథుడను మహాయోగివద్ద శ్రీవిద్యను ఉపదేశము పొంది గంగాతీరమున అయిదు సంవత్సరములు తపస్సుచేసెను. ఆ యోగిపుంగవువలన సిద్ధులను దెలసికొని వేదాంతశాస్త్రమునుకూడ నేర్చెను. పిమ్మట శ్రీదేవి అను గ్రహమును సంపాదించి కీర్తనలను జెప్ప నారంభించెను.

తిరుత్తణిక్షేత్రమున మాళవగౌళరాగమున ప్రథమా విభక్త్యంతముగా "శ్రీనాథా గురు గుహోరాజయతి" యని సంస్కృతమున మొదటి కీర్తనను జెప్పెను. 'శ్రీనాథా' యనునది శ్రీ విద్యయందు గురుధ్యాన శ్లోకారంభమునగలదు. గురుధ్యానముకొరకే ఈ కీర్తన ఉద్దేశింపబడినది. శ్రీ విద్య యందు కాదిమతమని, హాదిమతమని రెండు సాంప్రదాయములు గలవు. అందులో తనది కాది మతమైనట్లు ఈ కీర్తన

యందు "కాది మతానుష్ఠానో" యని చెప్పరి. సహస్ర కమలాసీనుడైన బ్రహ్మామే గురువుగాను, అజపాహంస ధ్యాన విషయమునుకూడ ఈ కీర్తనయందు చెప్పెను.

కాంచీపురమున శ్రీ కామాక్షిని దర్శించి అట కొంత కాలము తపస్సుచేసి శ్రీ కామాక్షిని స్తుతించుచు "కంజ దళాయతాక్షి" "ఏకామ్రనాథం భజేహం" మొదలైన కీర్తనలను జెప్పెను.

తిరువారూరుకు వచ్చి కొంతకాలము ఉండి అచ్చట వేంచేసియున్న శ్రీ త్యాగరాజస్వామిని దర్శించి స్వామిని స్తుతించుచు గురుగుహ ముద్రతో అనేక కీర్తనలను రచించెను. అటులనే ఆ క్షేత్రమునగల ఆనందేశ్వర, సిద్ధేశ్వర, అచలేశ్వర, హాటకేశ్వర, వల్మీకేశ్వరులమీదను, షోడశ గణపతుల మీదను, చోళమండలమున గల శివక్షేత్ర, విష్ణు క్షేత్రములందుగల దేవతలను దర్శించి ఆ దేవతలమీదను, మరియు పృథివ్యాది పంచభూతస్వాముల మీదను, మధుర, అళగిరు, గోవిలు మొదలయిన పాండ్యదేశక్షేత్రములందలి దైవముల మీదను, కాశీ మొదలైన క్షేత్రములందలి దైవముల మీదను సంస్కృతమందు అసమానమైన ధారతో, అద్వైతపరముగ, వెంకటమఖి (చతుర్దండి ప్రకాశిక క్రీ. శ, 1660) సంగీత సాంప్రదాయము ననుసరించిన రాగములతో గమకములు, రాగజీవ స్వరములు మున్నగు లక్షణములు ఒప్పునటుల రాగనామములనుకూడ జేర్చి కీర్తనలను రచించెను. ఇదిగాక సూళాది సప్తతాళములలో నవగ్రహ కీర్తన

లను, కమలాంబా విషయమై నవావరణ పూజా క్రమముగా తొమ్మిది కీర్తనలను రచించెను.

దీక్షితులవారు శ్రీ విద్యారహస్యములను నెరింగి దేవీ పరముగ స్తుతిరూపమున గానమున మేళవించి అనేక కీర్తనలను రచించిరి.

చివరరోజులలో ఎట్టయపురము మహారాజావారి జ్యేష్ఠ కుమారుని పెండ్లికై ఆహ్వానమురాగా ఎట్టయపురమునకు వెళ్లి పెండ్లియైన మూడవ నెలలోనే శా. శ. 1757 క్రీ. శ. 1835 సం॥ సరియగు మన్మథ సంవత్సర ఆశ్వీయుజ బహుళ చతుర్దశి యందు యశఃకాయులైరి.

... ... ... ...

## (3) శ్యామా శాస్త్రులు

శ్రీ కంచి కామాక్షీదేవి యనుగ్రహమున శ్యామా శాస్త్రులు తంజావూరు ప్రాంతమునగల శ్రీపురమను తిరువారూరిలో శా. శ. 2685 క్రీ. శ. 1763 చిత్రభాను సంవత్సరమున మేషమందు రవియుండగా: చైత్రమాసమున కృత్తికా నక్షత్రమందు శనివారమున జన్మించెను. కృత్తికా నక్షత్రము చైత్రమాసమున సాధారణముగా శుద్ధ తదియరోజున వచ్చుచుండును. ఈయన గౌతమసగోత్రము, బోధాయనసూత్రము. అసలుపేరు వెంకట సుబ్రహ్మణ్యము. శ్యామకృష్ణ యని పిలుచుటచే ఆపేరు వచ్చెను.

ఈయన బాల్యమునందే సంస్కృతాంధ్రములలో గొప్ప పండితుడయ్యెను. తంజావూరునందు సంగీతమును నేర్చెను. అంతలో శ్రీ విద్యయందు దీక్షనుపొందెను. ఉత్తర దేశమునుండి సంగీతస్వాములని సంగీత విద్యయందు గొప్ప పండితుడైన యొక యతీంద్రుడు రాగా వారికి శిష్యుడయ్యెను. మూడు సంవత్సరముల పర్యంతము అభ్యసించి సంగీత లక్ష్య లక్షణములందలి రహస్యము లన్నిటిని తెలిసికొనెను. శ్యామా శాస్త్రులు స్వల్పకాలములోనే సంగీతమందు గొప్ప సామర్థ్యమును సంపాదించెను. గురువుగారగు సంగీతస్వాములు వీరి శక్తిని గమనించి యశోవంతుడ వౌదువని అనుగ్రహించి పచ్చిమిరియం ఆదిఅప్పయ్య పాటను కొన్ని దినములు వినుమని చెప్పి కాశికి వెళ్లిరి.

శ్యామాశాస్త్రిలు గురువుగారి ఆజ్ఞప్రకారము ఆది అప్పయ్యగారి గానమును వినెను. పిమ్మట శ్రీకామాక్షీ దేవి యనుగ్రహమున సాహిత్య చమత్కారములు, గేయ కల్పనలు, "శ్యామకృష్ణ" అను ముద్రతో అనేక కీర్తనలు, స్వరజతులు, తానవర్ణములు రచించి శిష్యులమూలమున లోకమున ప్రవర్తింపజేసిరి. వీరి కీర్తనలు మూడునూర్లకుపైగా యున్నవి. వీరు శా. శ. 1749 క్రీ. శ. 1827 సం॥ వ్యయ సంవత్సర పుష్య శుద్ధ దశమి రోజున శ్రీపురమును జేరిరి.

(1) ఈయన కుమారుడు సుబ్బరాయశాస్త్రి, (2) పోరంబూరు కృష్ణయ్య, (3) అలసూరు కృష్ణయ్య, (4) సంగీత స్వామి, (5) దాసరి మొదలగువారు శ్యామాశాస్త్రిలువద్ద సంగీతవిద్యను నేర్చినవారిలో ముఖ్యులు.

— —

# . సంగీత వాద్యములు

## 1. వీణా వాద్యము

వాద్యము లన్నిటిలోను వీణావాద్యము మొదటిది.
వ అనాదియైనది. ఇది వేదము నుండి ఉద్భవించినది.
వ శ్రీ దేహధర్మము ననుసరించి ఈ వాద్యము ఏర్పడి
న వేదము చెప్పుచున్నది. వేదజనితమైన (నర) వీణయే
స్వ మశములు మున్నగువానిని పలికించుటకు యోగ్య
మైనదిగా చెప్పబడినది.

### (1) వీణా నిర్మాణము

వీణయందు శిరస్సు, దండము, పుచ్ఛము అను మూడు భాగములు గలవు. మనుష్య దేహము నందలి శిరస్సే వీణ యందలి శిరస్సుగాను, దేహభాగము దండముగాను, చివర భాగము పుచ్ఛముగాను నిర్మించబడినవి.

వీణయొక్క శిరోభాగమున మొదటియందు తీగలు కట్టబడియుండును. అక్కడనుండి తీగలు దండముయొక్క చివరభాగమున ఎత్తుగాగల మేరువుయను స్థానమువరకు వచ్చి, ఆ మేరువను ఆనియుండి వాటిచివరభాగములు మేరువకు తరువాతను పుచ్ఛభాగమునం దమర్చబడిన బిరడాలకు చుట్టబడియుండును. ఈతీగలు వీణశిరస్సునందు లలాట భాగమున ఏర్పడి యుండు పీటమీద ఆనియుండును. పీటమొదలు మేరువు వరకుగల తీగ

భాగమే వాదనము చేయు సమయమున చలనమగును. అడ్డముగా నుంచుకొని వాదనము చేయునపుడు శిరో వాదకునికి కుడివైపునను, మేరువు యుండు భాగము వైపునను ఉండును, వీణయొక్క ఎడమ భాగము శిరస్సుతో సమానముగా వాదనము చేయునపుడు నిలుపు కొనుటకుగాను సొరకాయ బుర్ర యొకటి ను నకు అడుగు భాగమున అమర్చబడి యుండును.

## (2) వీణయందు తీగలు

వీణకు పై భాగమున దండము మీద నాలుగీగ లును, వాదకుని వైపున ప్రక్కగా పీటప్రక్కన ఎత్తుభాగము ఆని యుండునట్లు శ్రుతికొరకు మూడు తీగలు అమర్చ బ యుండును. ఈ తీగలు పై నాలుగు తీగలవలె బారుగా ను డక వాదకుని వైపున వీణా దండమున కొంతవరకే అమర్చ బడిన బిరడాలకు చుట్టబడి యుండును.

దండము పైనగల తీగలలో మొదటి తీగకు అన మంద్ర పంచమ మనియును, రెండవదానికి మంద్రషడ్జ మ యును, మూడవదానికి మంద్రపంచమ మనియును నాలుగ దానికి (వాదకుని వైపునయుండు తీగకు) మధ్యషడ్జ మనియు పేర్లు.

తీగలందు శ్రుతి జేయబడు స్వరనాదముల ననుసరిం వాట్లకు ఆ పేర్లు వచ్చినవి. వీనిలో మధ్యషడ్జ తీగకు సార యని పేరు. ఈ నాలుగు తీగలలోను అనుమంద్ర పంచవ

మంద్రషడ్జతీగలు యిత్తడివి. మంద్రపంచమ తీగయును, మధ్య షడ్జ తీగయును ఉక్కువి. ప్రక్కన శ్రుతికొరకు ఏర్పడిన మూడు తీగలుకూడ ఉక్కువే యుండును.

ప్రక్కన శ్రుతికొరకు ఏర్పాటు చేయబడిన మూడు తీగలలోను పైభాగమునగల మొదటి తీగకు మధ్యషడ్జ మనియును, రెండవదానికి మధ్యపంచమ మనియును, అన్నిటి కంటెను అడుగుభాగమున యుండు మూడవదానికి తార షడ్జ మనియును పేర్లు.

## (3) వీణయందు శుద్ధవికృతస్వరములు

వీణాదండముయొక్క పైభాగమున శుద్ధ వికృత స్వర స్థానములలో ఉక్కుతోగాని కంచుతోగాని అడ్డముగా మెట్లు అమర్చబడియుండును. ఇవి స్థాయి ఒకటికి 12 వంతున రెండు స్థాయిలలో 24 మెట్లును, తార పైషడ్జము కొరకు మరొక టన్ని మొత్తము 25 మెట్లు అమర్చబడియుండును. వీణ యందు రెండవస్థాయి కంఠస్థానముతో పూర్తి యగును. ఆ తరువాతనుకూడ మెట్ల నమర్చిన ఒకదానికొకటి కలసి ఎడములేక వాదనమునకు అనుకూలముగానుండవు. అందువలన రెండుస్థాయిలవరకే అమర్చబడి యున్నవి.

ఈ కారణమువలన మంద్రషడ్జ, మంద్రపంచమ తీగల యందు మంద్రస్థాయియు, సారణి తీగయందు మధ్య, తార స్థాయిలును వినియోగ మగుచున్నవి.

# ఉదాహరణము

అనుమంద్రస్థాయి

| పంచమతీగ మధ్యస్థాయి | షడ్జతీగ మంద్రస్థాయి | పంచమతీగ మంద్రస్థాయి | మేరువు |
| --- | --- | --- | --- |
| శు. రి | శు. ధ | శు. రి | |
| శు. గ | శు. ని | శు. గ | 2 శు. ధ |
| చ. రి | చ. ధ. | చ. రి | |
| ష. రి | ష. ధ | ష రి | 3 చ–ధ=శు.ని. |
| సా. గ | కై. ని | సా. గ. | |
| | | | 4 కై. ని=షధ |
| అం. గ | కా. ని | అం. గ | |
| | | | 5 కా. ని |
| శు. మ. | స. | శు. మ | |
| | | | 6 స |
| ప్ర. మ | శు. రి | ప్ర. మ. | |
| | | | 7 శు. రి |
| | శు. గ | | |
| ప. | చ. రి | ప. | |
| | | | 8 చ. రి=శు.గ |
| | ష. రి | | |
| శు. ధ | సా. గ | శు. ధ | |
| శు. ని. | | శు. ని | 9 సా. గ=ష.రి |
| చ. ధ | అం. గ | చ. ధ | |
| ష. ధ | | ష. ధ | 10 అం. గ |

షడ్జతీగ

మధ్యస్థాయి

ప్రక్కసారణి మధ్యస్థాయి

ఈ పై పధకమునందు తీగను ఎడమచేతి వ్రేళ్లతో మెట్టుమీాద అదిమిపట్టి ఆ తీగను కుడిచేతి వ్రేళ్ళతో మీాటు నప్పుడు ఆ మెట్టుయొక్క స్వరము పలుకును. మెట్లమీాద వాదనము చేయబడు నాలుగు తీగలందును ప్రతితీగకు ఏమెట్టు నందు ఏ స్వరము పలుకునో తెలుపబడినది.

అనుమంద్ర పంచమ తీగయందుకూడ స్వరములు చూపబడినవికాని ఆ తీగకు గానమందు వినియోగము లేదు. రక్తికొరకు తానమునందును, అపుడపుడును దానిని కొట్టు చున్నారు.

శ్రుతి తీగలను నేడు తాళపు తీగలని వాడుచున్నారు. కేవలముగ తాళముకొరకే యగుచో కీర్తనలలో ఘాతలందు మాత్రమే వాటిని ధ్వనింపజేయవలెను. తాళమునకు ఒక తీగయే చాలును. రాగమునందు వాటికి వినియోగమే లేక పోవలెను. రాగమునందు శ్రుతితీగలకు వినియోగమే లేనిచో ఆ గానమునందు రక్తి లోపించును. గనుక వాటిని ప్రధాన ముగ శ్రుతి తీగ లనియే చెప్పవలెను. అందు తాళమునకు కూడ వినియోగము కలదు. శ్రుతితీగలు గానమునందు శ్రుతి కొరకును, కీర్తనలందు శ్రుతి, తాళముల కొరకును, తానమునందు శ్రుతి, లయల కొరకును వినియోగ మగు చున్నవి,

## (4) వీణపై తీగలను శ్రుతిజేయు విధానము

సారణి తీగయందు గాత్రమునకు అనుకూలము
నాదమును ముందుగా స్థిరము చేసుకొనవలెను. పిమ్మ
మంద్రపంచమ తీగను మేరువుగాక అయిదవ మెట్టుమీ
ఎడమచేతి తర్జని, మధ్యమ వ్రేళ్ళతో అదిమి కుడిచేతిత
సారణి తో కలిపి మీటుచు సారణి తీగ నాదముతో సమా
ముగా ఆ తీగను శ్రుతి జేయవలెను. రెండును సమాన
లైన పిమ్మట ఎడమచేతి వ్రేళ్ళను తీసివేసి మీటిన సార
తీగయందు మధ్య షడ్జనాదమును, రెండవ తీగయందు మం
పంచమనాదమును శ్రుతి యగును. తరువాతను మంద్ర
తీగను మేరువుగాక ఏడవమెట్టునందు అదిమి దానిని మం
పంచమ తీగ నాదముతో సమానముగ శ్రుతిజేసి వ్రేళ్ళ
తీసి మీటిన దానియందు మంద్ర షడ్జనాదము శ్రుతియగు
తరువాత అనుమంద్ర పంచమ తీగను అయిదవ మెట్టున
అదిమి దానిని మంద్రషడ్జ తీగయందలి నాదముతో సమ
ముగ శ్రుతిజేసి పిమ్మట వ్రేళ్ళను తీసి మీటిన అందు
మంద్ర పంచమ నాదము శ్రుతి యగును.

## (5) ప్రక్క తీగలను శ్రుతిజేయు విధము

పై నాలుగు తీగలను శ్రుతిజేసిన పిమ్మట సారణి
నాదముతో సమానముగా ప్రక్కతీగలలో మొదటిదా
కలిపి శ్రుతి జేయవలెను. పిమ్మట మేరువు గాక ఏడవ
నందు సారణి తీగను పలికించిన అది మధ్యస్థాయి ష

నాద మగును. ఆ నాదముతో సమానముగా ప్రక్క తీగల లోని రెండవతీగను శ్రుతి జేయవలెను. తరువాతను మేరువు గాక 12 వ మెట్టునందు సారణి తీగను పలికించవలెను. అది తారషడ్జనాదము. ఆ నాదముతో సమానముగ ప్రక్క తీగల లోని మూడవతీగను కలిపి శ్రుతి జేయవలెను. అప్పుడు ప్రక్కతీగలు మూడును వరుసగా మధ్యషడ్జ, మధ్యపంచమ, తారషడ్జ నాదములు కలవగును.

## (6) వ్రేళ్ళను ఉపయోగించెడు విధానము

1. కుడిచేయి తీగలను మీటుటకు మాత్రము ఉపయోగ పడును.
2. ఎడమచేయి మెట్లను అదుముటకొరకు ఉపయోగ పడును.
3. రెండు చేతులను జేర్చి ఒకాదాని కొకటి వదలని సంబంధముగలవై అనుసరించి యుండుటవలన గమక భేదములు కలిగి మిగతా వాద్యములకంటెను వీణా వాద్యము ఎక్కువ రక్తి నిచ్చుచున్నది.

## (7) కుడిచేతి అభ్యాసము

1. కుడిచేతి మణికట్టునకు సమీపమున గల అరచేతి యడుగుభాగమును వీణయొక్క కంఠస్థానమునకు సమీపమునగల శిరస్సునందు అంచున ఆనించి యుంచ వలెను.

2. బొటనవ్రేలిని ప్రక్కను ఆధారముగా పూనికకొరకు ఆనించుకొనవలెను.

3. చేతియొక్క మీదిభాగమును వంచి పట్టవలెను.

4. తర్జని, మధ్యమ, అనామిక ఈ మూడువ్రేళ్ళను వీణ మీది తీగలపై వంపుగా నుంచవలెను.

5. చిటికెనవ్రేలిని ప్రక్కతీగలకు క్రిందుగా వంచి పట్ట వలెను.

## (8) మీటుటకు సాధనములు

1. మీటుటకై చేతిగోళ్ళను పెంచిన చాలా అనుకూల ముగా నుండును. లేనిచో వెండిచేతగాని, దంతముచేత గాని, కనీసము ఉక్కుచేతగాని గోళ్లను చేయించు కొని వాటిని చేతికి పెట్టుకొని మీటవలెను.

2. తర్జనీవ్రేలు, నడిమివ్రేలు ఈ రెండుమాత్రము మీద నుండెడు నాలుగు తీగలను మీటుటకు ఉపయోగ పడును.

3. అనామిక వ్రేలు ఉపయోగపడదు.

4. ప్రక్క తీగలను మూటిని మీటుటకు చిటకెనవ్రేలు మాత్రము ఉపయోగపడును.

## (9) వీణయందలి మీటుల వివరములు

వీణావాదనముకొరకు (1) గోటిమీటు (2) లోమీటు (3) వెలిమీటు (4) కత్తిరమీటు (5) తోడుమీటు (6) తడమీటు (7) అడ్డమీటు (8) దొడ్డమీటు (9) సన్నమీటు (10) అబద్ధపుమీటు (11) కూటమీటు (12) విడిమీటు (13) ప్రక్కమీటు అని కొన్ని మీటులు చెప్పబడినవి.

### వివరములు

(1) గోటిమీటు

విడిగా పడెడుమీటు గోటిమీటు.

(2) లోమీటు

ముందటివేలు మీదనుండి క్రిందుగా మీటుట లోమీటు.

(3) వెలిమీటు

క్రిందనుండి మీదికి మీటుట వెలిమీటు.

(4) కత్తిరమీటు

ముందటివ్రేలు వంచక మిక్కిలి వడిగా మీటుట.

(5) తోడుమీటు

ముందటివ్రేలును, నడిమివ్రేలును మార్చిమార్చి మీటుట.

(6) తడమీటు

త్రిశ్రజాతియందు మూడో అక్షరమును నడిమివ్రేలిచే మీటుట,

(7) అడ్డమీటు

నాదమును ఖండించుటకుగాను ముందటి వ్రేలిచే మీటిన స్వరమును నడిమి వ్రేలిచే అడ్డగించుట ఈ విధముగా అడ్డగించిన నాదమును నడిమి వ్రేలిచే మీటుట అడ్డమీటు.

(8) దొడ్డమీటు

మిగుల బలముగా శబ్దించునటుల మీటుట దొడ్డమీటు.

(9) సన్నమీటు

నాదము సూక్ష్మముగా శబ్దించునటుల మీటుట సన్న మీటు.

(10) అబద్ధపుమీటు

వర్ణము, కీర్తన మొదలైనవాని మాతువు (సాహిత్యము) లందు అక్షరము లేని తావుల వేసెడిమీటు.

(11) కూటమీటు

మీది తీగలు నాలుగును చూపుడు వ్రేలు, నడిమి వ్రేలు, ఉంగరపు వ్రేలు మూటిని జేర్చి చాచి రంజనమునకై ఒకేమీటుగా అనుమంద్రమునుండి మీటుట కూటమీటు అనబడెను. మంద్రపంచమ సారణి తీగలను బొటన వ్రేలిని త్రిప్పి దాని గోటిచే ఒక కొట్టుగా కొట్టి విడుచుటయును కలదు.

(12) విడిమీటు

మంద్రపంచమ, సారణి తీగలను కొన్నికొన్ని సందర్భములలో రంజనమునకై విడివిడిగా మీటుట విడిమీటు.

(13) ప్రక్క మీటు

చిటికెనవ్రేలుచే మూడుతీగలను క్రిందినుండి మీదుగా ఒకే కొట్టుగా మీటుట.

ఏకకాలపు మీట్లు

మరియు తాళములందు ఘాతపడెడి తావులందు మీది తీగలలో లోమీటును ప్రక్క తీగలందు చిటికెన వ్రేలి మీటును యేకకాలమున సమముగా పడవలయును.

(15) ఘాతలందు ప్రక్కమీటు

కొన్ని సమయములలో ఘాతలందు లోమీటు లేకనే ప్రక్కమీటు మాత్రము పడుటకలదు.

(16) ప్రక్కతీగలను మీటుట

అలాపనము చేయునపుడు కొన్ని సమయములలో ప్రక్కతీగలను విడివిడిగా సమయోచితముగ మీటుట కలదు. లో మీటును ప్రక్కమీటును తడబాటులేక స్వభావముగా పడునట్లు లెస్సగా అలవడుటకుమునుపు ఎడమచేయి సాధకము మొదలుపెట్ట తగదు.

## (10) ఎడమచేతి అభ్యాసము

(1) ఎడమచేతిని వీణాదండము క్రిందుగా పోనిచ్చి వ్రేళ్ళను తీగలమీదికి తెచ్చి యందుంచి అదిమి వాయించవలెను.

(2) బొటనవ్రేలును దండమునకు ఆనించుకొని వాయించవలెను.

(3) మెట్లయందు ఎడమచేతితో అదుమనక్కరలేని తీగలకు కుడిచేతి మీటులే చాలును. వీనికి ఎడమచేతితో నిమిత్తము లేదు.

(4) ఎడమచేతి తర్జని, మధ్యమవేళ్ళచేత మెట్లను అదిమి వాయించవలెను.

(5) తీగలను కుడిచేత మీటుటయును, యెడమచేత మెట్ల నదుముటయును సమముగా నుండవలెను.

... ... ... ...

## 2. ఫిడేలు వాద్యము

దీనికి యింగ్లీషు భాషలో వయొలిన్ (VIOLIN) అని పేరు. కృష్ణాజిల్లా మచిలీపట్టణ వాస్తవ్యులు బ్రహ్మశ్రీ వాగ్గేయకారరత్న హరి నాగభూషణముగారు దీనికి వాయులీనమని పేరుపెట్టిరి. ఈ పేరును యిప్పుడు అనేకులు వాడుకొనుచున్నారు.

ఫిడేలు జంత్రవాద్యములలోనిది. జంత్రివాద్యమనగా తీగలుగల వాద్యము. భరతీయ సంగీతమున జంత్రివాద్యములలో వీణకు తరువాత రెండవస్థానము ఫిడేలుకే లభించినది.

ఫిడేలు చక్కని వాద్యము. ప్రక్క వాద్యముకొరకు యిది విశేషముగా ఉపయోగపడుచున్నది.

స్వయముగా జంత్రవాద్యమును వాయించుకొనుచు గాత్రమున గానము చేయునట్టి జంత్రి గాత్రజ్ఞుల గానమును మొదటిరకముగా చెప్పనగును. తరువాతను కేవల గాత్ర గానము రెండవస్థానము నాక్రమించినది. మూడవదిగా కేవల వాద్యగానమును చెప్పవలయును. ఎంతటి గొప్పవారిచే వాదన మొనర్పబడినను కేవల ఫిడేలు వాద్యగానము సంపూర్ణత నొందజాలదు. అంతమాత్రమున ఆ వాద్య గానమును తక్కువజేయుటకు వలనుపడదు. ఉన్నంతవరకైనను ప్రదర్శింప గల సమర్థులు అందు అద్భుతముగా తమ నైపుణ్యమును జూపగలరు. వాద్యముకొరకు వినయోగమగు నపుడు ఫిడేలు భారతీయ సంగీతమున మిక్కిలిగా శోభించుచున్నది.

ఫిడేలు వీణావాద్యముయొక్క వికృతి యనవచ్చును. పరిమాణములలోను, ఆకారాదులలోను మార్పులుగలవేగాని గానశాస్త్రము అన్నిటికిని సమానమే యగుచున్నది. ఫిడేలు వాద్యము నందుగల పెట్టె శిరస్సులేని దేహముయొక్క ఆకారమును బోలియుండును, అయినను ఈ పెట్టె మొదటిభాగమే శిరోభాగముగా గ్రహించబడి తీగలు అచ్చటనే కట్టబడు చున్నవి. పీటయుండు ప్రదేశము లలాటస్థానము. కమానుతో

తీగలను కదలించు ప్రదేశము జిహ్వాస్థానము. ఫిడేలు దేహ భాగము దాటిన పిమ్మట దిగువను దండమువలె వాద్యము కొరకు కొంతవరకు పొడిగించబడినది. పొడిగింపబడిన ఈ భాగముతో సహా పీటకు సుమారు మూడంగుళముల సమీపము వరకు పలక ఒకటి పైన అమర్చబడి యుండును. దీనిని బోర్డు అని వాడుచున్నారు. వ్రేళ్ళతో వాయించునపుడు తీగలు స్వరస్థానములందు ఆనియుండుటకువీలుగా యీబోర్డు ఏర్పాటు చేయబడినది.

బిరడాలవైపున తీగలు ఆనియుండుటకు మొదటను ఏర్పాటు చేయబడిన ఎత్తుగానుండు మెట్టునకు మేరువ యని పేరు. ఈ మేరువు మొదలు పీటవరకుగల తీగభాగముమాత్రమే వాద్యసమయమున చలన మగుచుండును. ఇందలి తీగలను వాద్యసమయమున ధ్వని పజేయుటకు గాను ఉపయోగించు సాధనమునకు కమాను అని పేరు. పీటకు సమీపమందు కుడి చేత పట్టబడిన కమానుతో తీగలు ధ్వనింపజేయబడును. ఆ సమయమున ఎడమచేతి వ్రేళ్ళను తీగలమీద ఆయా స్థానములలో నొక్కుటవలన స్వరములు పలికించబడుచున్నవి.

ఫిడేలుయొక్క బిరడాలవైపు భాగమును క్రిందివైపుగా కాలిమీదను, ఫిడేలు దేహముయొక్క మొదటిభాగమును భుజమునకును ఆనించుకొని వాదన మొనర్పబడుచున్నది.

దీని యందు నాలుగు తీగలు అమర్చబడియుండును. వానిలో ఎడమవైపునుండి మొదటి దానికి మంద్రషడ్జతీగ యని, రెండవ దానికి మంద్రపంచమ తీగయని, మూడవదానికి మధ్యషడ్జ తీగయని, నాలుగవదానికి మధ్యపంచమ తీగయని పేర్లు. వీనిలో మొదటి మూడు తీగలు నరమునకు సంబంధించినవి. నాలుగవ తీగ (మధ్యపంచమము) ఉక్కుది. నేడు మూడవ (మధ్యషడ్జ) తీగగా అల్యూమినం తీగను వినియోగించుకొనుచున్నారు. మొదటి రెండు తీగలలోను మంద్రస్థాయియు, మూడు నాలుగు తీగలలో మధ్య, తారస్థాయిలును వినియోగమగుచున్నవి.

స్వరస్థానములు వీణయందువలెనే ఆయా తీగలందు క్రమముగా వినియోగమగుచున్నది. ఫిడేలు గాత్రధర్మము గల వాద్యము. మంచి రక్తి నిచ్చును. విశేషముగా గాత్రమునకు ప్రక్కవాద్యముకొరకు అనుకూలించును.



# 9. స్వర జతులు

## (1) రావేమే మగువ

ఆనందభైరవి రాగము—త్రిపుటతాళము—చతురశ్రజాతి

చిత్రతరమార్గము : ఆరోహణము = స గ రి గ మ ప ధ ప ని స

సమగ్రహము : అవరోహణము = స ని ధ ప మ గ రి స.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పల్లవి | పా; | పమగమ | పామా | పమగరి | సా; | ;మా | గా, రి | సా నీ |
| | రా | . . వే. | . మే | మ . . గు | వా | వి | న వు | తగ |
| | సా; | ; సా | ; నీ | గా రీ | సగరిగ | ,మగమ | పధపపా | మగమ॥పా॥ |
| | వా | వే | డు | కను | కరుణనే | డువగ | గలుగతో | డుకొని॥రా॥ |
| అనుపల్లవి | పా, | ప ;సా | నీనీ | సాసా | సా ,మ | ;గా | రీసా | నీసా |
| | వే | వే గ | ముగ | జని | నా వి | భు | గను | గొని |
| | పా, | స ;సా | నీధా | పామా | మా,ప | ;మా | గా రీ | గామా ॥పా॥ |
| | యీా వా | ము | వల | దని | యీామా | ట | వి ను | మ ని. ॥రా॥ |

